॥ శ్రీహరిః ॥

# శ్రీ కృష్ణభగవానుడు

भगवान् श्रीकृष्ण (तेलुगु)

త్వమేవ మాతా చ పితా త్వమేవ
త్వమేవ బంధుశ్చ సఖా త్వమేవ ।
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ
త్వమేవ సర్వం మమ దేవదేవ ॥

ఎస్. జయలక్ష్మి బి.ఎ.బి.ఇడి.,

గీతాప్రెస్, గోరఖ్‌పూర్.

॥ శ్రీహరిః ॥

# నివేదన

బాలబాలికలకు మహా పురుషుల యొక్కయు అవతార పురుషుల యొక్కయూ జ్ఞానమెంతైన ఆవశ్యకము. వారి చరిత్రలలోని ముఖ్య ఘటనలు బాల బాలికలకు తెలియ వలయునను నుద్దేశ్యముతో శ్రీకృష్ణభగవానుడను ఈ పుస్తకము ప్రచురింపబడినది. ఈవిధముగా అనేకమయిన అవతార పురుషుల గాథలు, వీరుల గాథలు, సాధువుల చరిత్రములు, పతివ్రతా స్త్రీల గాథలు వారి జీవిత విశేషములతో, చదివిన బాలబాలికలకు వారి జీవితమున సదుపదేశము గలుగ గలదు. మనోరంజకమూ గాగలదు.

మన బాలబాలికలకై గ్రంథములు మేము ముందుగా హిందీ భాషలో ప్రచురించితిమి. కానీ ఈ సదుపయోగము భారతీయవాసులందరికీ లభింపవలయునను భావనతో తెలుగులోనికి తర్జుమా గావించి ఆ గ్రంథములు ప్రచురించుట జరుగుచున్నది.

భారతీయ వాసులందరూ ఈ పుస్తకముల నధ్యయనము జేసి మన దేశ సంస్కృతిని పూర్వ పురుషుల చరిత్రలను తెలుసుకొనగలరని మనవి. మన బాలిబాలికలకు ఈ రచనలు జ్ఞానోపయోగమున నుండునని మా అభిప్రాయము.

వినతులతో

**ప్రకాశకులు**

# విషయ సూచిక

|| శ్రీహరిః ||

# శ్రీకృష్ణ భగవానుడు

## 1. కంసునిఅత్యాచారము

మన పంచాంగాలలో కలియుగ సంవత్సరమని వ్రాయబడి యుంటుంది. విక్రమనామసంవత్సరము 2052 నకు కలియుగ సంవత్సరము 5096 జరుగుచున్నది. ఏ రోజునైతే శ్రీకృష్ణభగవానుడు భూలోకమును వీడి గోకులధామమును జేరినాడోనాటి నుండియు కలియుగారంభమైనది. భగవానుడు శ్రీకృష్ణావతారము నెత్తి షుమారుగ 5000 సంవత్సరములపైనే అయినది.

ఆ సమయమున మధురానగరమును ఉగ్రసేనుడను రాజు పాలిస్తూ యుండెడివాడు. అతని పెద్దకుమారుడు కంసుడు. చాలా బలవంతుడు మరియు నిర్దయుడు. ఈ దేశము నందెంతమంది యత్యాచారులు పాపులు, దుర్మార్గులైన రాజులు గలరో వారందరు కంసుని మిత్రులే. దుస్సాంగత్యమున మనుజులు దుష్టులుగనే మారుదురు గదా! ఎంతయో ధర్మాత్ముడైన ఉగ్రసేనుని కుమారుడు కంసుని సహవాసదోషమున అధర్ముడై అన్యాయానికి ప్రతిరూపమైనాడు.

దేవకుడు ఉగ్రసేనుని సోదరుడు. అతని చిన్నకుమార్తె దేవకి. ఆమె వివాహము, వసుదేవునితో ఎంతో వైభవముగ జరిగినది. కంసుడు, తన పినతండ్రికుమార్తె యయిన దేవకీదేవి నెంతగానో ప్రేమించెడి వాడు. వివాహానంతరము దేవకీ వసుదేవులను తనరథమందు గూర్చుండబెట్టి తానే స్వయముగా సారథియై రాచనగరుకు ప్రయాణమైనాడు. అకస్మాత్తుగా దారిలో అ శరీరవాణి కంసుని ఇలా హెచ్చరించింది'. ★ ఓరీ మూర్ఖుడా, కంసా ఎవరినైతే అత్యంతాభిమానముతో నీరథమందు తీసుకొని వెళ్ళుచున్నావో, ఆమె యష్టమ పుత్రుడే నిన్ను సంహరింప గలడు.

అశరీరవాణి వాక్కులను విన్న కంసుడు క్రోధముతో తన సోదరియని యైన దలంపక దేవకీదేవి కేశముల బట్టి యీడ్చి యామెను సంహరింప కత్తి నెత్తగా - వసుదేవుడు 'బావా పుట్టిన ప్రతి జీవి మరణించుట తథ్యము. కాని కాలము తీరనిదే యొకరి ప్రాణములు దీయుట, సాధ్యము గాని పని. అమాయకురాలైన నీ సోదరిని జంపి పాపము మూట గట్టుకొని యపకీర్తి పాలు గావద్దు. లోకులు నిందింతురు. పాపము జేయువారు నరకమున బడుదురు.

కంసుడెంత నిర్దయుడు, పాపాత్ముడైన వానికి వసుదేవుని నీతులు చెవిన బడుట లేదు. 'నేనీమెను సంహరించినచో నన్ను జంపువాడెట్లు జన్మించునని తలచుచుండెను. వసుదేవుడెంత బోధించినను కంసుడు వినుట లేదు. అయినను వసుదేవుడు 'బావా! నీసోదరి నిరపరాధి. ఆమె వలన నీకెటువంటి భయము లేదు. నీకే దైనను అపాయము సంభవించిన అది యీమె సంతానము వలన గదా. వారిని నీకు సమర్పింతును. ఈమెను విడిచి పుచ్చు'మని ప్రార్థించెను.

కంసుడు వసుదేవుని మాటల విశ్వసించి స్వగృహము జేరెను. వసుదేవుడు తన ప్రథమ సంతానమును జన్మించగనే కంసుని వద్దకు జేర్చెను. తమ సంతానమును తామే స్వయముగా నొక నిర్దయుడు పాపాత్ముడైన వాని చేతులలో వధించుటకై అప్పజెప్పివచ్చుట చాలా దుఃఖకరము, మరియు

---

**కం!! తుష్టయగు భగిని మెచ్చగ, నిష్టుడవై రథము గడపెదెఱుగవు మీదన్**
**శిష్టమగు నీతలోదరి, యష్టమగర్భంబు నిన్ను హరియించుజుమీ.**

(శ్రీ బమ్మెరపోతన - భాగవతము 10/23)

★ తాత్పర్యము - కంసుడా! నీతోడ బుట్టువైన దేవకి మెచ్చునట్లు ప్రీతితో రథము తోలుచున్నవాడవు. ఇంకమీద రాబోవు విషయములనెఱుగవు. నీ సోదరి యొక్క యెనిమిదవ కుమారుడు నిన్ను హరియించును సుమా!

విశేషార్థము : **'తుష్ట'!** యనువిశేషణముచే దేవకి బ్రహ్మ ప్రాప్తిచే నిరతిశయానందము గలదని భావము. **'శిష్ట'** అనుటచే ఆమె స్వరూప విచారణ చేత ఉత్తమురాలు. అట్టి బ్రహ్మవిద్య యొక్క అష్టమగర్భంబు **'అహంబ్రహ్మోస్మి'** అను స్వరూపాహంకారము. పంచభూతములు, మనోబుద్ధులు, అహంకారము కూడి అష్ట ప్రకృతులు, అందు ఎనిమిదవ **'అహం బ్రహ్మోస్మి'** యను స్వరూపాహంకారము అష్టమ గర్భమాయెను.

బాధాకరమైనది. కాని వసుదేవుడు తన వాగ్దానము నిలుపుకొనుటకే యీ దుఃఖము గూడ సహించెను. ★ సత్పురుషులు తమ సత్య సంధతకై ఎంతటి కష్టములయినను సహింతురు గదా!

కంసుడు వసుదేవుని ప్రథమ సంతానమును జంపక విడిచి పుచ్చెను. భక్తుల కష్టముల దీర్చుటకై భగవానుడవతరించవలెనని నారదుని కోరిక.

ఈ పని యెంతో త్వరితముగ జరుగవలెను. దానికై కంసుని పాపము పండవలెనని ఆలోచనతో నారదుడొకయుపాయము బన్ని కంసుని కడకేగెను. ఒక వర్తులాకారము మీద నెనిమిది రేఖలు గీసి కంసుని లెక్కింపు మనెను. కంసుడెటునుండి లెక్కించినను సమీపమున నున్న రేఖ యెనిమిదవ రేఖగనే గన్పట్టు చుండెను. దేవకి జన్మనిచ్చిన ప్రతి బిడ్డ యెనిమిదవ వాడుగనే భ్రమించు చుండెను. అనగా తనను సంహరించువాడు గానే గాన వచ్చెను. వెంటనే తాను స్వయముగా దేవకీ వసుదేవుల గృహమున కేగి వారి ప్రథమ సంతానమును రాతి మీద యెత్తి వేసి చంపెను. ఎచ్చటికైన పారిపోవుదురను భయముతో దేవకీ వసుదేవుల బందీలుగ జేసెను. అంతియేగాక, తన తండ్రియయిన ఉగ్రసేన మహారాజును బలవంతముగ కారాగృహమున వైచి మథురకు తానే రాజాయెను. దేవకీ వసుదేవుల ఆర్గురు పుత్రులను సంహరించెను.



---

★ **కం॥ పలికిన పలుకులు దిరుగక, సొలయక వంచనములేక సుతులరిపునకున్**
**గలగక యిచ్చిన ధీరుం 'డిల వసుదేవుండు దక్క నితరుడు గలడే.**

(శ్రీ బమ్మెరపోతన భాగవతం -10/45)

అను మాటలు శుక మహర్షి పరీక్షిన్మహారాజుతో పల్కినవి. 'ఓ రాజా చెప్పిన మాటల తప్పక సంకోచము మోసము లేక 'పుత్రేణ లోకా జాయంతే, అపుత్రస్య గతిర్నాస్తియను శ్రుతులను దాటి, మనో చంచలము లేక శత్రువైన కంసునకు పుత్రులను చంపుటకే యిచ్చిన ధైర్యశాలి వసుదేవుడు. అతడొకడు తప్ప భూలోకమందిట్లు జేసిన వారలన్యులు గలరా! ఇది సత్య వ్రతము. సత్య వ్రతానికై ధనమాన ప్రాణములు సైతము నర్పించుటలో సత్యసంధులు వెనుకాడరు.

# 2. శ్రీకృష్ణావతారము - గోకుల ప్రయాణము

వసుదేవునికి దేవకియే గాక మరికొందరు పత్నులు గలరు. వారందరూ కంసుని భయముచే మధురను వీడి యన్యప్రదేశములకు పారి పోయి తలదాచుకొనిరి. నందుడు వసుదేవుని మిత్రుడు గోపకుల రాజు. యమునా నది కావలి తీరమున గోకులము కలదు. వసుదేవుని భార్యరోహిణి గర్భవతి. కంసుని భయము వలన మధురానగరమును వీడి గోకులములో నందుని వద్ద యుండ సాగినది.

దేవకీదేవి సప్తమ గర్భమును ధరించినది. భగవానుని యవతారమునకు భూమిక తయారు గావలయును. యోగమాయను రావించి యోగమాయా! దేవకీదేవి సప్తమ గర్భస్థుడైన సంకర్షణుని రోహిణీ దేవి గర్భమున ప్రవేశపెట్టుము. తరువాత నేను స్వయముగా దేవకీదేవి యష్టమ గర్భవాసుడనయి జన్మించెదను. నీవు యశోదా దేవి పుత్రికవై జనన మందుము.'

భగవానుని యాజ్ఞాను సారము దేవకీ దేవి సప్తమ గర్భము రోహిణీ గర్భమున ప్రవేశపెట్టబడెను. బలరాముడు జన్మించినాడు. మధుర లోని వారందరు దేవకీ దేవి గర్భము విచ్ఛిన్నమయినదని భావించిరి. దేవకీ దేవి యష్టమ గర్భము దాల్చినది. భగవానుడు స్వయముగా నామె శిశువై జన్మించనున్నాడు. దేవకీ దేవి శరీరమొక వింత తేజస్సుతో ప్రకాశించు చున్నది. కంసుడు కాపలాను మరింత పటిష్టము జేసెను.

శ్రీ మహావిష్ణువు భాద్రపదమాస, కృష్ణపక్ష అష్టమీ యర్ధరాత్రి సమయమున దేవకీ వసుదేవుల పుత్రుడై ఆవిర్భవించెను. నీల మేఘశ్యాముడు, శ్యామసుందరుడు, పీతాంబరధారి, చతుర్భుజుడు, శంఖ, చక్ర, గదా పద్మధారుడు, మణి మయ రత్నమకుట, కుండల కేయూర కంకణధారుడు, సర్వాభరణభూషితుడయిన ఆదేవ దేవుని దివ్య సుందర విగ్రహమును దేవకీ వసుదేవులు కన్నులార గాంచి యానంద పరవశులైరి. వారి జన్మ ధన్య మయినది. ఆయన శరీరము నుండి వెడలిన కాంతులతో కారాగారమంతయూ వింత వెలుగుతో ప్రకాశింప దొడగినది.

దేవకీ వసుదేవులు భగవానుని యెన్ని యోవిధముల ప్రస్తుతించిరి. దేవకీ దేవి భగవానుని - ప్రభూ! చతుర్భుజుడవైన నీ దివ్య సుందర విగ్రహమును దాచియుంచుము. అందరి కంట బడిన ప్రమాదము. కంసునికి దెలిసిన ఆఘమేఘముల మీద పరుగెత్తి వచ్చును. నాకు భయము కలుగుచున్నది' అని ప్రార్థించెను.

భగవానుడు దేవకీ దేవి ప్రార్ధన మన్నించి తన రూపము (చతుర్భుజ) నుపసంహరించి శిశువైనాడు. ★మరియు వసుదేవునితో - 'నన్ను గోకులమునకు జేర్చి అచ్చటి యశోదా పుత్రిక నిచటకు దోడ్కొని రండు -' అని దెల్పె. వసుదేవుడా శిశువును చేటలో పరుండ బెట్టెను. వసుదేవుని సంకెళ్ళు తమంతట తామే విడి పోయినవి. ద్వారములన్నియు తామే దెరచుకొన్నవి. కాపలా దారులు గాఢ నిద్రలో మునిగి యున్నారు. మార్గము సుగమ మాయెను.

ఆకాశమంతయు మేఘావృతమైనది. మెరుపులు మెరయు చున్నవి. జోరున వర్షమారంభమైనది. శిశువుతో వసుదేవుడు కారాగృహము నుండి వెలుపలకు రాగానే, తడియకుండా తన సహస్రశీర్షములతో ఆదిశేషుడు ఛత్రము బట్టినాడు. యమున పొంగుతున్నది. వసుదేవుని మోకాళ్ళ వరకే నీరుండునట్లు యమున దారి నిచ్చినది.

వసుదేవుడు సునాయాసంగా గోకులమున ప్రవేశించెను. దైవమాయ వలన గోకులమంతయు గాఢ సుషుప్తిలో మునిగిపోయినది. అదే సమయమున యశోదా దేవి యొక బాలికకు జన్మనిచ్చినది. ఆమెకు స్పృహ లేదు. తాను బిడ్డనే కన్నదో, బాలుడినే ప్రసవించినదో ఆమెకు తెలియదు.

---

★ **సీ!!** **జలధరదేహు నాజాను చతుర్బాహు, సరసీరుహాక్షు విశాలవక్షు,**
**జారుగదాశంఖచక్రపద్మవిలాసు కంఠకౌస్తుభమణికాంతి భాసు**
**గమనీయ కటిసూత్ర కంకణ కేయూరు, శ్రీవత్సలాంఛనాంచిత విహారు**
**ఉరకుండల ప్రభాయుత కుంతలలలాటు, వైదూర్యమణిగణవరకిరీటు**
**తే!!** **బాలు పూర్ణేందురుచిజాలు భక్తలోకపాలు సుగుణాలవాలు కృపావిశాలు**
**జూచి తిలకించి పులకించి చోద్యమంది, యుబ్బి చెలరేగి వసుదేవుడుత్సహించె.**
(శ్రీ బమ్మెరపోతనభాగవతము 10/99)

నిరాటంకముగ వసుదేవుడు నంద గృహము జొచ్చినాడు.

యశోదా దేవి ప్రసవించిన బాలికను దీసుకొని, భగవానుని నచ్చట నుంచి తిరిగి మధురకు ప్రయాణమైనాడు. వసుదేవుడు కారాగృహమును ప్రవేశించగనే తలుపులు తిరిగి వాటంతటవే మూసుకొని పోయినవి. వసుదేవుడు తిరిగి సంకెళ్ళు ధరించినాడు. శిశువు రోదన విన్న కావలి వారు పరుగు పరుగున కంసుని కీ సమాచారమంద జేసిరి.

కంసునికి భయముతో నిద్ర పట్టకున్నది. ఏ నిమిషమున ఏ వార్తలు వచ్చునో యని ఎదురు చూడసాగెను. సమాచారమందగానే పాదరక్షలు గాని, శిరస్త్రాణము గాని ధరించకయే కరవాలము ధరించి కారా గృహమునకు పరుగెత్తి వచ్చినాడు. కంసుని చూడగానే దేవకీ దేవి బిడ్డనొడిలో దాచియుంచి రోదించుచూ 'అన్నా ఇది ఆడుబిడ్డ దీనిని వధించకు' మని దీనయై ప్రార్థించినది.

కంసుడే దేవకీ దేవిని బెదిరించి, భయపెట్టి ఆపసికందుని కాలు పట్టి లాగి బండరాయిపై కొట్టి చంపబోయినాడు. ఆ బిడ్డ సామాన్యురాలుగాదు. ఆమె యోగమాయ. కంసుని చేతి నుండి తప్పించుకొని పైకెగసి అష్టభుజరూపిణియై 'దుష్టా కంసా! నిన్ను సంహరించెడి వాడు జన్మించినాడు. నిరపరాధుల దండింపవద్దని గర్జించి అంతర్ధానమయింది.

ఆమె పలుకులు విన్న కంసుడు భయభ్రాంతుడయినాడు తన తప్పిదము గ్రహించి, దేవకీ వసుదేవుల తన యపరాధముల మన్నింపుమని ప్రార్థించి ★వారిని తమ మందిరమున కంపినాడు. మరుసటి దినమున

★ ఉ!! **పాపుడ బాలఘాతకుడ, బంధువిరక్తుడ దుష్టచిత్తుడన్**
**గోపనుడన్ జరన్మృతుడ, గ్రూరుడ బ్రాహ్మణహంతభంగి మీ**
**పాపల జంపితిన్ బయలి పల్కుల నమ్మితి, సాధులార నా**
**పాపములుగ్గడింపక కృపా, పరులై కనరే శమింపరే.**

(శ్రీ బమ్మెరపోతన భాగవతము 10/140)

తాత్పర్యము - 'సజ్జనులైన ఓ దేవకి వసుదేవులారా! నేను పాపిని, శిశుహంతను, అయిన వారిని తల్లడిల్ల జేసిన వాడను, చెడు చేయు బుద్ధి గలవాడ, కోపిని, బ్రతికియు చచ్చినవాడను, కఠినుడను. బూటకపు ఆకాశవాణి మాటలు నమ్మి మీ బిడ్డల కోపముతో త్రుంచితిని. నన్ను తిట్టక క్షమించి తప్పు గొని రక్షింపుము'. అని వేడు కొనియెను.

తన మంత్రుల సలహాదారులరావించి విచారించినాడు. మధురలో జన్మించిన పదునైదు దినములలోని శిశువుల నందరినీ సంహరింపుమని సలహానొసగిరి. వారి మాటలాలించిన కంసుడు పూతన, శకటాసురుడు, వ్యోమకాసురుడు మొ!! రాక్షసుల రావించి శిశు సంహారము జేయుడని యాజ్ఞాపించెను.



# బాలకృష్ణుడు - రాక్షస సంహారము

వ్రజరాజు నందున కెటువంటి సంతతి లేదు. వృద్ధాప్యములో యశోదా దేవికి సంతానము కలుగ బోవుచున్నదని నందుడు విని యెంతయో ఆనందించినాడు. నంద గోకులములో ఆనందోత్సాహములు వెల్లివిరిసినవి. భాద్రపద కృష్ణఅష్టమీ రాత్రి యశోద ప్రసవించినది. వసుదేవుడు భగవానుని యచట (గోకులములో) నుంచి తిరిగి మధుర జేరు వరకు గోకుల మంతయు మత్తులో మునిగి యున్నది. తదుపరి అందరి మత్తు వీడిన క్షణముననే యశోద ప్రసవించినదని కనుగొని వారు వాద్య తాళములతో పెద్ద యుత్సవము జేసుకొనినారు.

శ్రీకృష్ణ జన్మోత్సాహానంతరము నంద మహారాజు కొద్ది మంది గోపకులను గోకుల రక్షణకు అచటనే యుంచి మరి కొంత మందిని తనతోడునిడుకొని ; కంసునికి సాలుసరి కప్పము జెల్లించుటకై మధుర ప్రయాణమాయెను. అదే సమయమున కంసునిచే నియమింపబడిన బాలహంత్రి పూతనయను రాక్షసి గోకులము ప్రవేశించెను. తన కామరూప ధారణ శక్తితో అపురూప సౌందర్యవతిగ మారి అందరినీ అలరించుచు నిరాటంకముగ నంద గృహము ప్రవేశము జేసెను. ఆమె నడ్డగించు వారేలేరు. పద్మమును ధరించిన లక్ష్మి దేవియే సాక్షాత్తు బృందావనమున ప్రవేశించినదని యందరు భ్రమించిరి.

ఊయలలో పరుండిన శ్రీకృష్ణుడు అర్ధ నిమీలిత నేత్రుడై పూతనాగమనమును గ్రహించెను. పూతన తన స్తనములందు విషము

నింపుకొని వచ్చినది. విషపూరిత మయిన చూచుక గ్రహణము జేయగనే బాలుడు మరణించునని యామె తలంచినది. బాలునికి పాలు త్రాపు నెపమున వాని నోడిలో నిడుకొని స్తన మందించినది.

భగవానుడు పూతన దురాలోచన గ్రహించినాడు. స్తన్య విషముతో పాటామె ప్రాణములు గూడ పీల్చనారంభించెను. తీక్షణమైన బాధతోనామె శరీరము కంపించ సాగెను. శ్రీకృష్ణుడామెను విడువ లేదు. పూతన ప్రాణములు కడబట్టెను. ఆమె తన వికృత రూపముతో పెద్దగా నరచుచు నేల గూలి మరణించెను. నేల గూలిన దేహంబును తుండెములుగా ఖండించి గోపకులు దహనము గావించిరి. అంత పెద్ద శరీరము నెవ్వరు కదల్చగలరు? గోపకులు ఆమె శరీరము గొడ్డళ్ళతో ఖండ ఖండములుగ జేసి దహించిరి. భగవానునికి స్తన్యమిచ్చిన కారణమున దాని శరీరము పవిత్ర మాయెను. మంటలలో దహింపబడుచున్ననామె శరీరము నుండి సుగంధ వాయువులు వెలువడ సాగెను. ★పూతన వెంబడి వచ్చిన గోపికలు దాని శరీరము మీద నాడు కొనుచున్న శ్రీకృష్ణుని అక్కున జేర్చుకొని లాలించిరి.

కంసుని సుంకము జెల్లించిన పిదప నందుడు వసుదేవుని గలిసి కొనెను. వసుదేవుడు, గోకులమందు నుత్పాతములు గలుగనున్నవని, శీఘ్రమే తిరిగి వెడలుమని నందుని హెచ్చరించెను. గోకులము ప్రవేశించు దారిలో పడియున్న అనేక మైళ్ల పొడవు, వెడల్పు గలిగిన భయంకరమైన పూతన మృత దేహమును జూచెను.

శ్రీకృష్ణుడు తొలిసారి బోర్ల పడుట నేర్చుకొనెను. ఆ దినమున

---

★ **ఆ!! పొగిలి పొగిలి కాలు, మగువదేహంబున, నగరుపరిమళముల, పొగలు వెడలె**
**దేహకల్మషములు, శ్రీహరిముఖమున, ద్రావబడుటజేసి భూవరేణ్య.**

(శ్రీబమ్మెరపోతన భాగవతము 10/212)

ఆహా! ఏమి విచిత్రము, పూతన దేహము నందలి పాపములను పరమాత్మ పాలతో దాగెను గాన పునీతమైన ఆమె దేహమును కాల్చిన వేళ కమరు కంపుకొట్టు పొగలు రాక, అగరు గంధపు పొగలు వెడలి యచ్చరువొందించెనని శుకయోగీంద్రుడు పరీక్షిన్మహారాజునకు దెల్పె. కుటిలమైన బుద్ధితో విషము ద్రావించిన తల్లి పూతనకే పరమాత్మ డిట్టి అద్భుతము గూర్చిన, ప్రేమాభిమానంబుతో పాలనర్పించువారికా పరమాత్మ యెట్టి శుభంబుల జేకూర్చునో కదా.

యశోదా దేవి పెద్ద యుత్సవము జేసెను. ఉత్సవమునందు గోప గోపికలందరూ పాల్గొనిరి. యశోదా దేవి శ్రీకృష్ణునకు పాలు త్రాగించి ఒక బండిక్రింద నూయల గట్టి పరుండజేసెను. కొంతమంది గోపికల నచ్చటనే రక్షణకై యుంచి తానతిథి సత్కారముల మునిగి పోయినది.

శకటాసురుడు కంసుని సేవకుడు. ఆతడు తన మాయచే గోకులము జొచ్చి కృష్ణుని పరుండబెట్టిన శకటమునందు ప్రవేశించెను. ఎంతో వేగమున బండిని తోసి బండి క్రింద పరుండిన బాలకృష్ణుని జంపవచ్చునని యూహించెను.

శ్రీకృష్ణ భగవానుడు వాని భావము గ్రహించెను. ఎంతయో నాకలి గొన్న వాని వలె కాళ్ళు చేతులు కొట్టసాగెను. వాని పాదముల తాకిడికి శకటము విరిగి పోయెను. శకటమునందు దాగి యున్న శకటాసురుడు నశించెను. బండిలో నున్న పాలు, పెరుగు, వెన్న గల కుండలన్నీ పగిలి పోయి క్రిందకు కారజొచ్చెను. శకటము విరిగి పడిపోయిన శబ్దమునకు గోపకులందరు పరుగెత్తి వచ్చిరి. యశోదా దేవి బాలకృష్ణుని యక్కున జేర్చుకొన్నది.

ఇదే విధముగా కంసునిచే పంపబడిన మరియొక రాక్షసుడు తృణావర్తుడు. శ్రీకృష్ణుని సంహరించు నుద్దేశ్యముతో గోకులము ప్రవేశించెను. ఆ సమయమున యశోదా దేవి శ్రీకృష్ణునొడిలో గూర్చుండబెట్టుకొని యాడించుచున్నది. తృణావర్తుని రాక భగవానుడు గ్రహించినాడు. యశోద యొడిలోనున్న శ్రీకృష్ణుడున్నట్లుండి బరువెక్కనారంభించెను. ఆ బాలుని భారము భరించలేక యశోద వానిని నేలపై గూర్చుండ బెట్టిలోనికి బోయెను. తృణావర్తుడొక సుడిగాలిని సృష్టించి యాప్రదేశము నంతయు ధూళి ధూసరితము గావించి యంధకారమయము జేసినాడు. ఆ చీకటిలోన కృష్ణునెగర వేసుకొని పోయెను.

మొదట ఎంతో తేలికగనున్న బాలుడు రానురాను భారము కాసాగెను. ఆ బరువు తృణావర్తుడు మోయలేక పోయినాడు. భగవానుడు తన రెండు చేతులతో వాడి మెడగట్టిగ నొక్కివేసెను. మెడ నొక్కుటచే కండ్లు వెలుపలకు వచ్చెను. నోట మాట రాకున్నది భయంకరముగ నరచుచు

నేలపై గూలెను. ఆకాశము నుండి క్రిందకు నందుని గృహద్వారమున నున్న రాతి మీద పడుటచే నాతని శరీరము పలు ముక్కలైపోయినది. క్రిందపడిన వాని శరీరముపై నాటలాడు కొనుచున్న బాలకృష్ణుని గోపికలు యశోదా దేవికి నొప్పగించిరి.

## 3. శ్రీకృష్ణునిబాల్యలీలలు

గార్గమహర్షి వసుదేవుని పురోహితుడు. గొప్ప జ్యోతిశ్శాస్త్రవేత్త. వసుదేవుడు పంపగా బాలురిరువురకు నామకరణము గావించుటకై గోకులము వచ్చెను. పెద్దవాడు బలరాముడు. చిన్నవాడు శ్రీకృష్ణుడు, ఇరువురత్యంత సుందరులు. బలరాముడు గౌరవర్ణుడు (ఎరుపు) కృష్ణుడు నీలమేఘ శ్యాముడు. గోకులము నందు అందరూ వీరినెంతగానో ప్రేమించెడివారు. గోపిక లెల్లపుడు కృష్ణ దర్శనము కాంక్షించెడివారు. బలరామకృష్ణులిరువురు చంచలురు. అల్లరిపిల్లలు. ఒకప్పుడు బురద నీటిలో చిందులు వేయుదురు. మరియొకప్పుడు లేగదూడ తోకపట్టుకొని హాస్యము లాడుచుండెడివారు. వేరొకప్పుడాకాశములోని సూర్య చంద్రులను తమ కైవసము జేసుకొన వలెనని మొండితనము జేయుచుండెడి వారు. రోహిణీ యశోద లొక్కక్షణమయినను బిడ్డలవీడక వెన్నంటి యుందురు.

కొంత వయస్కులు కాగానే రామకృష్ణులిరువురు తమ వచ్చీరాని యడుగులతో, బుడి బుడి నడకలతో, నందరిమనసుల కాహ్లాదము గూర్చుచుండిరి. తమ తల్లులకు చిన్న చిన్న వస్తువులు తెచ్చి యందించుటవంటి పనులు జేసెడి వారు. నందుని కాలి జోళ్ళు తెచ్చి పెట్టెడివారు. ఒకనాడొక పండ్లమ్ము అవ్వ వచ్చినది. ఆమె కేక వినగానే శ్రీకృష్ణుడు తన చిన్న దోసిలి నిండా ధాన్యము దెచ్చి వేయబోయెను. కానీ యతని చిన్నారి దోసిలి నుండి ధాన్యమంతయు దారిలో పడి పోయినది. పండ్లమ్ము యవ్వ శ్రీ కృష్ణుని దోసిలి నిండుగ ఫలముల నింపినది. శ్రీకృష్ణుడామెకు తగిన ప్రతి ఫలమునీయగోరెను. ఆమె తన యిల్లు జేరి చూడగా రత్నాలు, వజ్రాలు కెంపులతో యామె గంపనిండి యుండెను.

పసివారి చిలిపితనము వారి యల్లరి యందరి మనసును రంజింప జేయును. గోకులములోని గోపికలందరు చిన్ని కృష్ణుడెప్పుడు వచ్చునో, తన చిలిపి చేష్టలతో తమ్మానందపరచునో యని అతని రాకకై వేయి కళ్ళతో నెదురు జూచుచుందురు. శ్రీకృష్ణుడిప్పుడు రెండేండ్ల వాడయినాడు. తన సమవయస్కులయిన గోప బాలుర గూర్చుకొని యిండ్లిండ్లు తిరిగెడి వాడు. కట్టివేసిన లేగ దూడలను విడిపించెడి వాడు. వేరొకయింట తన మిత్రులతో గలిసి వెన్న మీగడల నారగించెడి వాడు. శ్రీకృష్ణుని అల్లరి అందరికీ నాహ్లాద కరముగ నుండెడిది. అప్పుడప్పుడు శ్రీ కృష్ణుని బెదరించుటకై యశోదాదేవి వద్దకు ఫిర్యాదు చేయుటకై వెళ్ళెడివారు. యశోద కృష్ణుని మందలించబోగా నామెను వారించెడి వాడు.

ఒకనాడు శ్రీకృష్ణుడు మన్ను దినెనని బలభద్రుడు మొదలగు వారు యశోదతో చెప్పగా, 'ఏ దీ నీనోరు చూపు'మని ఆమె గద్దించె. కృష్ణుడంతట తన నోట విశ్వరూపంబు జూపి ఆమె నాశ్చర్యపరిచె.★

ఒకనాటి ప్రాతః కాలముననే యశోదా దేవి మేల్కాంచి తానే స్వయముగా పెరుగు చిలక సాగినది. ఇంతలో శ్రీకృష్ణుడు నిద్రమేల్కొనెను. శ్రీకృష్ణునకు తాజా వెన్న యనిన ప్రీతిమెండు. తల్లి వద్ద జేరి పాలకై మారాము జేయసాగెను. యశోద వెన్న తీయుటమాని కృష్ణునకు పాలీయసాగింది. పొయ్యి మీద పాలు పొంగుచుండగా కృష్ణుని యచ్చటనే విడచి పొయ్యి వద్దకు పోయెను. శ్రీకృష్ణునకెంతయో కోపము వచ్చినది.

---

★ **విశ్వరూపంబును జూచిన యశోద మహాశ్చర్యంబు నొంది..**

**మ!! కలయో వైష్ణవమాయయో యితర సంకల్పార్థమో సత్యమో**
**తలపన్ నేరక యున్నదాననొ యశోదా దేవి గానో పర**
**స్థలమో బాలకుడెంత యతని ముఖస్థంబైయజాండంబు ప్ర**
**జ్వలమై యుండుట కేమి హేతువొ మహాశ్చర్యంబు చింతింపగన్**

(శ్రీబమ్మెరపోతన భాగవతము **10/306**)

బాలకుడు చిన్నవాడే. అణోరణీయాన్ మహతోమహీయాన్ అను శ్రుతిచే ఈ చిన్న వాని మాట అజాండంబులు ప్రజ్వలమై యుండె 'ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేనమ్' అట్టి యాశ్చర్యముతో యశోద పరమాత్మని లీలను గాంచి ముగ్ధురాలైనది.

తల్లికి తన కన్న పాల మీదనే మక్కువ యని పెరుగు కుండను పగులగొట్టి వేరొక యింటిలోనికి దూరెను. రోటి మీదకు నెక్కి ఉట్టి మీద వెన్న కుండను దించి కోతులకు వెన్న తినిపించసాగెను.

పొయ్యిమీద నుంచి పాలు దింపి వచ్చిన యశోదకు పగిలిన పెరుగు కుండ కనిపించెను. శ్రీకృష్ణుని అల్లరి మితిమీరి పోవు చున్నది. వానిని దండింపకున్న మరింత చెయిజారి పోవునని కృష్ణుని పట్టు కొనుటకై అటునిటు పరువిడ సాగెను. అలసి పోయిన తల్లిని జూచిన కృష్ణుడు జాలిపడి తనకు తాను గానే యశోదకు దొరికి పోయెను. క్రోధముతో యశోద శ్రీకృష్ణునొక రోటికి బంధించు యత్నము చేయసాగెను. ఎంత పెద్ద తాడయినను రెండంగుళములు తక్కువ పడుచున్నది. త్రాళ్ళెన్ని జోడించినను యామె ప్రయత్నములన్నియు విఫలమయ్యెను. తల్లి దీనావస్థను జూచిన శ్రీకృష్ణుడు తనకు దానే కట్టువడెను. భగవానుని బంధించుట యెవరి తరము? కేవలము ప్రేమతో గాక.

నలకూబర, మణిగ్రీవులు కుబేరుని పుత్రులు. ఒక పర్యాయము వారు నగ్నముగ స్నానము జేయుచు దేవర్షి నారదుని కోపాగ్నికి బలియైపోయిరి. వారిరువురును అర్జున వృక్షములుగమారి నందుని పెరటిలో శ్రీకృష్ణావతారమున భగవానునికై వేచి యుండిరి. భగవానుడిప్పుడు వారి శాపవిమోచనము జేయవలెనని సంకల్పించెను. తనను కట్టి వేసిన రోటిని తల్లి యశోద తన పనిలో నిమగ్నురాలయి యున్నప్పుడు, రెండు వృక్షముల మధ్య నుండి యీడ్చుకొని వచ్చెను. వృక్షములు పెళపెళ పెద్ద శబ్దము జేయుచు విరిగి పడి పోయినవి. నలకూబర, మణిగ్రీవులు శాపవిమోచనులై స్వామి నెంతగనో స్తుతించి తమ తండ్రి కుబేరు నొద్దకు జేరిరి.

అర్జున వృక్షములు విరిగి పడిన శబ్దమున కందరు గోపకులు, గోపికలు పరుగెత్తి వచ్చిరి. నందుడు శ్రీకృష్ణుని బంధము విడిపించి తన యొడిలో జేర్చి ముద్దులాడ సాగెను.



# 4. బ్రహ్మాదేవునిమతిభ్రమణము

ఒక దాని వెన్క మరియొకటిగా గోకులములో జరుగుచున్న యుత్పాతముల గాంచి గోపకులందరు భయభ్రాంతులైరి. ఎటువంటి తుఫాను, గాలీ వానా, లేకయే పెద్దవైన వృక్షములు పడి పోవుట జూచి యందరు గోకులమును వీడి వేరొక ప్రదేశములో తలదాచుకొనుటకై పెద్దలందరు నిశ్చయించిరి. శకటముల నిండ సామగ్రి నిడుకొని తమ తమ పిల్లపాపలతో బృందావనమును జేరిరి.

గోకులము వీడి మూడు నాలుగు వర్షములయినది. శ్రీకృష్ణుడిప్పుడేడేండ్ల వాడాయెను. తోటి బాలకులతో గూడ ఆలమందల మేపుకొని వత్తునని యన్న బలరామునితో తాను గూడా బయలు దేరుదునని మారాము జేయసాగెను. ఒకనాడు వత్సాసురుడను రాక్షసుడు తానొక దూడయై ఆలమందలలో జేరి శ్రీకృష్ణుని జంపు నవకాశమునకై నెదురు జూచుచుండెను. శ్రీకృష్ణుడది గమనించి తనయన్న బలరామునకు సైగ జేసెను. శ్రీకృష్ణుడు వత్సాసురుని సమీపించి నొక చెట్టునకు విసిరి కొట్టి చంపివేసెను. ఆ రాక్షసుడు విల విల తన్నుకొని వెంటనే ప్రాణములు వదిలెను.

శ్రీకృష్ణుని సంహరించుటకై కంసుడోమారు పూతన సోదరుడయిన బకాసురుడను వాని బంపెను. వాడొక పెద్ద కొంగ రూపము ధరించి ఒక మడుగున దాగి యుండెను. పశువులకు నీరు ద్రావించుటకై శ్రీకృష్ణుడు సరోవరమున దిగెను. తగిన సమయముకై వేచియున్న బకుడు కృష్ణుని తన ముక్కుతో బట్టెను. శ్రీకృష్ణుడు తన శరీరము నుండి యగ్నిని ప్రజ్వలింప జేసెను. ఆ వేడి భరించ లేని రాక్షసుడు శ్రీకృష్ణుని నేలపై బడవైచి తన ముక్కుతో బొడిచి చంప యత్నించెను. శ్రీకృష్ణుడా బకుని ముక్కును బట్టి వాని శరీరమును రెండుగ జీల్చి వేసెను.

పూతన, బకాసురుల తమ్ముడు అఘాసురుడు వాడొక కొండ చిలువ రూపమున తన భయంకరమైన నోరును దెరచి కొని పడి యుండెను. తెరచి యున్న వాని నోరు నొక కొండ గుహగా భ్రమించి ఆల మందల

సహితముగా గోపాలకులందరు అందు ప్రవేశించిరి. వారిని రక్షించుటకై శ్రీకృష్ణుడు తాను గూడా దాని నోట జొచ్చెను. లోనికి ప్రవేశించి శ్రీకృష్ణుడు తన శరీరమును విపరీతముగ పెంచ సాగెను. అఘాసురుని నవ రంధ్రములు మూసుకొని పోయెను. శ్వాస ఆడుట గూడ కష్టమై వాని మస్తిష్కము బ్రద్దలాయెను. వాని శరీరము జొచ్చిన గోప బాలకులందరు తమ తమ గోవులతోను లేగలతోను వెలుపలికి వచ్చిరి.

అఘాసుర సంహారిని గాంచిన బ్రహ్మదేవుడు భగవానుని మహిమజూడ దలచెను. ఒకనాడు శ్రీకృష్ణుడు తన మిత్రులతో గూడి యానందించుచుండ బ్రహ్మదేవుడు వాని దూడల, గోవుల మాయము జేసెను. శ్రీకృష్ణుడాల మందల వెదకబోవ నిట గోపాలుర నంతర్ధానము జేసెను. బ్రహ్మ వారందరినీ గోవత్సములతో సహా నొక గుహలో నుంచెను. భగవానుడు బ్రహ్మదేవుని మాయ కనుగొనెను. తానే స్వయముగా నందరి రూపుల ధరించెను. ★

ఈ విధముగా నొక సంవత్సరము గడచినది. బ్రహ్మదేవుడు పరికించి జూడ యథాతథముగ శ్రీకృష్ణుడు తన గోవులతో, గోపబాలురతో గూడి యాడుచుండెను. గుహలో గోపబాలురందరు నిద్రించుచుండిరి. బ్రహ్మ అయోమయములో పడిపోయెను. వాని మతి భ్రమించినది. ఇదియంతయు పరికింప శ్రీకృష్ణ మాయగ దోచెను. బ్రహ్మ తన తప్పిదమును గ్రహించి భగవానుని చరణములపై మోకరిల్లి యనేక విధముల స్తుతించెను. తన యపరాధముల మన్నింపుమని వేడి తానపహరించిన వారందరిని తిరిగి యిచ్చివేసెను.

---

**★ 5 కం!! రూపంబులెల్లనగు బహు, రూపకు డిటు బాలవత్సరూపంబులతో**
**నేపారుటేమిచోద్యము, రూపింపగ నతనికితరరూపము గలదే!**

(శ్రీబమ్మెరపోతన భాగవతము 10/461)

ప్రపంచములోని రూపములన్నియూ, తన రూపముగాగల భగవానుడు దూడల రూపములను గోప బాలుర రూపములను పొందుట వింత కాదు. విచారించగా ఆపరమాత్మ కంటె అన్యమైన రూపము లేదని భావము.

# 5. కాళియ మర్ధనము

యమునా నదిలో నొక లోతైన మడుగు కలదు. ఆ మడుగులో నూటొక్క శిరస్సులు గల కాళియుడను మహా సర్పము నివసించు చుండెను. వాని విషముచే యమునా నదీ జలములు కలుషితములై పోవుచుండెను. యమునా నది నుండి వీచు విష వాయువులచే పైన యాకాశములో స్వేచ్ఛగా తిరుగు పక్షులు సయితము క్రిందపడి మరణించసాగెను. సముద్రములోని 'రమణక' ద్వీపము నాగులకు వాసస్థానము. కాళియుడు వాని విష గర్వముచే గరుడుని యెదిరించెను. గరుత్మంతుడు తన రెక్కలచే నా సర్పమును కొట్టగా వాని భయముచే సముద్రమును వీడి కాళింది మడుగున తల దాచుకొనెను. సౌభరిముని శాపగ్రస్తుడయిన గరుడు డిచ్చటకు వచ్చునను భయము లేదు. ఎందువలననగా యమునా నదీ తీర ప్రాంతమున గరుత్మంతుడెవరిని సంహరించినను యది వాని మృత్యువే యగును.

ఒక దినము పశువుల మేపుచున్న గోపాలకులకు మిక్కిలి దాహము వేసెను. వారు యమునా నదీ జలములచే తమ దప్పిక తీర్చు కొనిరి. కానీ విష పూరితములయిన నీటిని త్రాగుటచే వారు స్పృహ దప్పి ప్రాణముల గోల్పోయిరి. శ్రీకృష్ణభగవానుడు తన కరుణా కటాక్షవీక్షణములచే వారిని తిరిగి జీవితుల జేసెను.

కాళియుని ఆ మడుగునుండి పారద్రోల వలెనని నిర్ణయించి శ్రీకృష్ణుడు సమీపమునగల కదంబ వృక్షము నెక్కి యమునా నదిలో దుమికి కాళియునికై వెదుక జొచ్చెను. నీటిలో యీదుచున్న కృష్ణుని జూచి కాళియుడు నీటిపైకి వచ్చెను. కాళియుడు తన విషపు కోరలచే శ్రీకృష్ణుని కాటు వేసి తన శరీరముతో నాతని చుట్టి వేసెను. కొంత తడవు శ్రీకృష్ణుడు మూర్ఛబోయినటుల నటించెను. బృందావనమున నెన్నియో అపశకునముల దోచెను. వ్రజవాసులీ యపశకునముల గాంచి చింతా క్రాంతులై శ్రీకృష్ణుని వెదుకుచు యమునా తీరమునకు వచ్చిరి. కాళియుని బంధములలో జిక్కి స్పృహగోల్పోయిన శ్రీకృష్ణుని జూచి విలపించ సాగిరి. శ్రీకృష్ణ భగవానుడు

తన శరీరము పెంచ సాగెను. కాళియునకు తన శరీరము ముక్కలైపోవునేమో యన్నంత బాధ గలిగెను. శ్రీకృష్ణుడు కాళియుని బంధముల నుండి విడిపించుకొని అటు నిటు నీదుచు నొక్క ఊపుతో వాని శిరస్సుపై కెగిరి గెంతులు వేయుచు నాట్యము జేయసాగెను. కాళియుని ఫణములన్నియు చిదికి, రక్తసిక్తము లాయెను. ఆ భయంకర సర్పము ప్రాణావసాన స్థితికి వచ్చెను.

కాళీయునిదీనస్థితిని గమనించిన వాని పత్నులు భగవానుని శరణు జొచ్చి ప్రార్థింప సాగిరి. శ్రీకృష్ణుడు కరుణించి, పత్నుల సమేతముగా యమునను వీడి సముద్రము జేర వలసినదిగ నాజ్ఞాపించెను. కాళియుడు మడుగు వీడెను. యమునా నదీ జలములు విష హీనములయి నిర్మలము లాయెను. భగవానుడు మడుగు నుండి వెలువడు వరకు యస్తమయమై చీకటి యావరించినది.

నాటి రాత్రి వ్రజవాసులందరచ్చటనే నిదురించిరి. అర్ధరాత్రి వేళ నాయడవిలో దావానలము రేగినది. గోపకులందరు భయభ్రాంతులై శ్రీకృష్ణుని శరణువేడిరి. భగవానుడందరినీ కన్నులు మూసుకొను మని తాను దావాగ్ని భక్షణము జేసెను. మరునాటి యుదయమున నందరూ కృష్ణునితో గూడి బృందావనమునకేగిరి.

# 6. అసురసంహారము

బృందావన సమీపమున నొక తాటితోపు గలదు. దాని యందు ధేనుకాసురుడను రాక్షసుడు తన యనుచరులతో గూడి గార్దభ రూపముల ధరించి సంచరించుచుండెను. ఆవనమునందు ప్రవేశించిన ప్రాణుల సంహరించి తినెడి వారు. ఒకనాడు శ్రీకృష్ణుడు తన మిత్రులు, అన్న బలరామునితో గూడి పశువుల మేపు కొనుచు నా తాడివన సమీపమునుండి పోవుచుండెను. బాగా మగ్గిన తాడిపండ్ల మధుర సుగంధములు గోపకుల నోరూరింపుచుండెను. వారు, తమ కోరిక రామ కృష్ణులకు తెలిపిరి. తన

మిత్రుల కోర్కె దీర్చ నెంచి బలరాముడొక తాటిచెట్టును సమూలముగ నూపి పండ్లను క్రింద రాల్చెను. పండ్లు క్రింద పడిన శబ్దము విని గార్దభ రూపముతో నున్న ధేనుకాసురుడు పరుగున వచ్చి బలరాముని ఛాతిపై తన వెనుక కాళ్ళతో బలముగా తన్నెను. బలరాముడు దాని వెనుక కాళ్ళు రెంటిని పట్టుకొని గిరగిరా తిప్పి నేలకు నీడ్చి కొట్టెను. ధేనుకాసురుని మరణము గాంచిన అతని పరివారమంతయు పరుగెత్తికొని వచ్చిరి. బలరామ కృష్ణులందరినీ సంహరించిరి. నాటి నుండి ఆతాళ వనము జనోపయోగమైనది.

ఒకసారి కంసుని చేపంపబడిన ప్రలంబుడను వాడు గోపబాలుని రూపము ధరించి వారిలో జేరి నాటలాడ జొచ్చెను. బాలకులందు రెండు పక్షములుగ విడివడిరి. ఒక పక్షపు నాయకుడు శ్రీకృష్ణుడు. మరియొక పక్షపు నాయకుడు బలరాముడు. శ్రీకృష్ణుని పక్షము ఓడిపోయెను. ఒప్పందము ప్రకారమోడిపోయినవారు గెలిచిన వారిని వీపు మీద కూర్చుండబెట్టుకొని మోసుకొనుచు 'భాండీర' వనము గుండా పోయి తిరిగి రావలయును. గోప బాలకుని వేషమున ప్రలంబుడు బలరాముని తన వీపుపై కూర్చుండబెట్టుకొని వేగముగా పరుగెత్తజొచ్చెను. బలరాముని కంసుని వద్దకు జేర్చవలెనని వాని యుద్దేశ్యము. బలరాముడది గమనించి తన శరీరమును పెంచ సాగెను. వాని శరీర భారము మోయలేక ప్రలంబుడు తన నిజ స్వరూపముతో బలరాము నెత్తుకొని యాకాశముపై కెగరజొచ్చెను. బలరాముడా రాక్షసుని పిడికిళ్ళతో మోదసాగెను. వాని ముష్టి ఘాతముల భరింపలేక ప్రలంబుడు తల పగిలి క్రింద పడి మరణించెను.

ఆ దినము మధ్యాహ్న సమయమున గోపబాలురందరు గూడి యాడు కొనుచుండిరి. ఆవులు పచ్చని గడ్డిచే నాకర్షితములయి ముంజారణ్యమున ప్రవేశించినవి. గోవులకై వెదకుచు గోపాలురు ఆ యరణ్యముజొచ్చిరి. ఆ సమయమున దావాగ్ని నలువైపుల జుట్టు ముట్టి దహించి వేయ సాగినది. శ్రీకృష్ణుడందరినీ కనులు మూసుకొనుడని చెప్పి దావాగ్నిని మింగి వేసెను. ఈ విధముగ గోవులు మరియు గోపాలురు మరియొక మారు దావాగ్ని బారి నుండి రక్షింపబడిరి.

మయుడొక దానవ రాజు. వాని కుమారుడు వ్యోమాసురుడు కంసుని మిత్రుడు. వాడొక నాడు గోపాలకుని రూపము ధరించి నందరితో గూడి

యాటలాడ సాగెను, బాలురందరు 'దొంగాట' ఆడుచుండిరి. ఈయాట యందు కొందరు దొంగలుగను, మరికొందరు తోడేళ్ళుగా యింకా కొందరు రక్షకులుగ మారి యాటలాడు చుండిరి. వ్యోమాసురుడు దొంగలుగా మారిన వారి గుంపులో జేరి దొంగలుగ మరియు తోడేళ్ళుగ మారిన వారినందరిని ఒక్కొక్కరిగ పట్టుకొని యొక గుహలో బంధించి దానినొక పెద్ద బండ రాతితో మూసివేసెను. ఈ విధముగ రాక్షసుడందరినీ గుహలో బంధించెను. శ్రీకృష్ణునికి సందేహము గల్గి వానిని వెంబడించి గట్టిగా పట్టుకొనెను. వెంటనే రాక్షసుడు పర్వతాకారుడైనాడు. కానీ శ్రీకృష్ణుడు తన పట్టు వీడ లేదు. భగవానుడు వానిని తన ముష్టి ఘాతములతో బాధించి చంపివేసెను. గుహ ద్వారమున నున్న బండ రాయిని తొలగించి మిత్రులందరినీ రక్షించెను.

# 7. గోవర్ధనోద్ధరణ

శ్రీకృష్ణుడొకనాడు పశువుల మేపు కొని తిరిగి యిల్లు చేరెను. ఇంటి వద్ద గోపకులు మరియు తన తండ్రి నందుడు ఇంద్రయాగము జేయుటకై సన్నాహములు జేయసాగిరి. వర్షాధిదేవత ఇంద్రుడు. వానిని సుముఖునిగా జేసుకొనుటకే యీ యజ్ఞము. భగవానుడింద్రుని మద మడచవలెనని దలచినాడు. బృందావనమునకు వన దేవత పర్వత రాజమైన గోవర్ధన గిరి. మన మందరము దీనినే పూజింతుమని యందరికీ నచ్చ జెప్పెను.

శ్రీకృష్ణ భగవానుని యిచ్ఛానుసారము గోపాలురు ఇంద్రయాగము మాని పర్వతరాజమైన గోవర్ధన గిరిని పూజించిరి. గో బ్రాహ్మణుల నారాధించి పూజించిరి. దాన ధర్మముల నొసగిరి. శ్రీకృష్ణ భగవానుడొక దివ్య పురుషుని రూపుదాల్చి వారి పూజలు మరియు భగవత్ప్రసాదముల తానే స్వయముగా స్వీకరించెను. గోపాలురందరు ఆదివ్యపురుషుని కీర్తించి, గిరి ప్రదక్షిణము గావించిరి.

తన నవమానించిన గోపాలురమీద ఇంద్రునకు కోపము వచ్చెను. ఆతడు ప్రళయ ప్రభంజనముల సృష్టించెను. తుఫాను మొదలయినది.

ఉరుములు మెరుపులతో గూడి కుంభవృష్టి కురియ సాగెను.

నందవ్రజమంతయు జలమయమాయెను. పశువులు చలిలో గజగజ వణికి పోవుచుండెను. గోపాలురందరు భయకంపితులై శ్రీకృష్ణుని శరణు వేడిరి. ఇది యంతయు ఇంద్రుడు కలిగించిన యుత్పాతమని శ్రీకృష్ణుడు గ్రహించెను.

శ్రీకృష్ణుడు వారందరికీనభయ మొసగెను భగవానుడు తన ఎడమచేతి చిటికెనవేలి కొన గోటితో గోవర్ధన గిరినెత్తి దాని ఛత్రఛాయలో బృందావన వాసులందరికీ పశు సమేతముగా నాశ్రయము గల్పించెను.

★ ఏడు దినము లెడ తెరిపి లేకుండ వడగండ్లవర్షము కురిసెను. గోవర్ధన పర్వతము మీద భగవానుని చక్రము పరిభ్రమించుచు వర్షపు నీటి నుండి యందరినీ రక్షించుచుండెను. ఐదు రోజులవర్షానంతరము మేఘములలో నీరింకిపోయినది. ఇంద్రుడు తన వజ్ర ఘాతము లొనరించి యలసి పోయినాడు. భగవానుని శక్తి స్వయముగ దర్శించినాడు. వాని గర్వమణగినది. మేఘముల నిలిపివేసెను. వర్షమాగిపోయినది. ఎండ పొడ చూపినది. గోపాలురందరూ సురక్షితముగ తమ తమ యిండ్లు జేరిరి. భగవానుడు గోవర్ధన గిరిని యధాతథముగ దాని స్థానమున నిలిపెను.

గర్వముడిగిన ఇంద్రుడు శ్రీకృష్ణుని సాక్షాత్ భగవానునిగ గుర్తించి వానిని సేవించుటకై భూలోకమునకు వచ్చెను. కామధేనువు క్షీరముతో, మరియు నాకాశ గంగజలముతో నభిషేకముగావించెను. తన యపరాధమును మన్నింపుమని పాదముల బడినాడు. శ్రీకృష్ణునకు గోవులన్న యెంతో ప్రీతి అందులకే ఆయన గోవిందు డయినాడు.

---

★ **కం!! ఏడేండ్ల బాలుడెక్కడ, క్రీడంగిరి తమ్మి యెత్తు క్రియనందఱమున్**
**జూడ గిరి యెత్తు టెక్కడ, వేడుకనొక కేలనేడు వెఱగొగాదే**

(శ్రీ బమ్మెర పోతన భాగవతము -10/860)

తాత్పర్యము - శ్రీకృష్ణ పరమాత్మ యేడేండ్ల బాలుడు. ఏడేండ్ల బాలునకు ఈ కొండకు యెంతటి భేదమున్నది. నేడు మనందరి యెదుట ఆటవలె యలక్ష్యముగా కొండ నొక్క చేత ఎత్తెను. ఇది వింత కదా యని ఆశ్చర్య పడిరి.

# 8. నందునిరక్షించుట

రాత్రి మూడవ ఝామున సరోవరముల యొక్క గానీ, నదుల యొక్క గాని నీటిని తాకరాదు. స్నాన మాడరాదు. ఆసమయమందు వరుణ దేవుని భృత్యులయిన యక్షులు సంచరిస్తూ వుంటారు. ఆనాడు ఏకాదశీ వ్రతము. అందరునూ భగవానుని కీర్తించుచూ జాగరణము జేయసాగిరి. నందుడది రాత్రి నాలుగవ జామని తలంచి స్నాన మాడుటకై యమునా నది జలముల ప్రవేశించెను. వరుణుని భృత్యుడొకడు నందుని పట్టి వరుణ దేవుని యొద్దకు తీసుకొని వెళ్ళెను. గోపాలు రందరు నందుని గానక యమునా నదీ జలముల మునిగి పోయెనని విలపింప సాగిరి. వారి రోదనలను విన్న శ్రీకృష్ణ భగవానుడు యమునలో దుమికెను. వరుణ లోకమును జేరిన శ్రీకృష్ణుని వరుణుడెంతో గౌరవించి పూజించి తన యపరాధము మన్నింపుడని ప్రార్థించెను. నందుని తోడ్కొని వరుణ లోకమునుండి శ్రీకృష్ణుడు యమునా నదీ జలముల నుండి వెలుపలకు వచ్చెను. నందుడు వరుణలోక వృత్తాంత మంతయు గోపాలురందరకు వినిపించి ఆశ్చర్య చకితుల జేసెను. శ్రీకృష్ణ భగవాను డనుగ్రహించి గోపాలురందరకు తన గోలోక ధామ దర్శనము గావించెను.

ఒక దినము శ్రీకృష్ణ బలరాములు తమ మిత్రుల గూడి గోవుల గాచుచు అడవిలో చాల దూరమేగిరి. మధ్యాహ్నామయినది. వారందరికి ఆకలి వేయసాగెను. అచ్చటికి కొద్ది దూరములోనె మథురా నగర బ్రాహ్మణులు యజ్ఞము జేయుచుండిరి. శ్రీకృష్ణుడు వారినడిగి భోజనము గొని తెండని గోప బాలురను వారి యొద్దకు బంపెను. వారచటికేగి శ్రీకృష్ణుడాకలి గొని యున్నాడని భోజన మొసగుడని ప్రార్థించిరి. కానీ బ్రాహ్మణులు మిన్నకుండిరి. గోపాలకులు నిరాశ జెంది తిరుగుముఖము బట్టిరి. శ్రీకృష్ణుడు ఈసారి బ్రాహ్మణస్త్రీల నడిగి భోజనము తెండని వారల మరల బంపెను. శ్రీకృష్ణుడు సమీపమున వనమందు విశ్రమించియున్నాడని తెలుసుకొన్న బ్రాహ్మణ పత్నులెంతో నానంద భరితలైరి. వారనేక విధముల మధురాన్నముల పళ్ళెములం దిడుకొని శ్రీకృష్ణుని జూడ పరుగెత్తి వచ్చిరి. భగవానుడు

వారిడిన భోజనము నెంతయో తృప్తిగా నానందముగ తన మిత్రులగూడి భుజించెను. భగవానుని సేవించి యజ్ఞశాలకు తిరిగి వచ్చిన తమ పత్నుల జూచిన బ్రాహ్మణుల పాపములన్నియు పటాపంచలై పోయినవి. భగవానుని యాకలి దీర్చలేక పోతిమని దుఃఖించిరి. శ్రీకృష్ణుని దర్శించ వలెనని యాస పడిరి కానీ కంసుని భయము వలన మిన్న కుండిరి.

భగవానుడార్త జనరక్షకుడు. భక్తుల పాలిటి పెన్నిధి. ఒక నాటి శివరాత్రి పర్వదినమున నందుడు బలరామకృష్ణుల దోడ్కొని శంకర భగవానుని పూజించుటకై అంబికావనమున కేగెను. గోపాలకులందరు శివరాత్రి వ్రతము జేసిరి. అందరు నలసి సొలసి నిద్రించుచుండగ నొక పెద్ద కొండ చిలువ వనమున ప్రవేశించి నందుని మింగి వేయ సాగినది. నందుడు కేకలు వేయసాగెను. గోపాలకులందరు, మహాసర్పమును తరిమి వేయుటకై మండుచున్న కాగడాలను విసిరి వేయ సాగిరి. అయినను అది నందుని విడువ లేదు. గోపకుల యరుపులు విన్న శ్రీకృష్ణుడచ్చటికి వచ్చి తన పాదములతో నామహాసర్పమును తన్నెను. శ్రీకృష్ణుని పాదములు సోకగానే ఆ కొండ చిలువ తన రూపమును వీడి యొక గంధర్వునిగా మారెను. సుదర్శనుడను నొక గంధర్వుడు, కురూపి యైన దేవల మహర్షిని జూచి పరిహసించెను. అప్పుడా ముని కోపగించి అజగరమై పొమ్మని శపించెను. శాపవిముక్తుడైన గంధర్వుడు భగవానుని స్తుతించి తన నిజ లోకమున కేగెను.



# 9. ముగ్గురుదుష్టులవధ

ఫాల్గుణ పూర్ణిమ నాటి రాత్రి. చల్లని వెన్నెల కాయుచున్నది. రాత్రి యింకను మిగిలి యున్నది. బలరామ కృష్ణులు యమునానదీ తీరమున తిరుగాడుచూ బృందావన శోభను తిలకించుచుండిరి. కొంత మంది గోపకాంతలు, పూవులు కోయుచు వారి వెనుకనే వచ్చుచుండిరి. కుబేరుని యనుచరుడు శంఖచూడుడను వాడు సుందరీమణులైన గోపికల చంక

నిడుకొని పరుగెత్త సాగెను. అసహాయలైన గోపికలు రామకృష్ణుల 'రక్షింపుడు,రక్షింపుడని' ఆర్త నాదములుజేయసాగిరి.

వారి అరుపుల విన్న బలరామకృష్ణులు భయ పడకుడని అభయమిచ్చి సాల వృక్షముల నిడుకొని శంఖ చూడుని వెంబడించిరి. వాడు గోపికలను నచటనే వదిలి భయముతో పరిగెత్త సాగెను. బలరాముని గోపికల రక్షణకై యునిచి భగవానుడు వానిని వెంబడించి సంహరించెను. వాని కేశముల యందున్న చూడామణిని దెచ్చి తన యన్న బలరామునకు కానుకగా సమర్పించెను.

అరిష్టాసురుడను నొక రాక్షసుడు వృషభరూపమును దాల్చి బృందావనమున ప్రవేశించి బీభత్సము జేయ సాగెను. ఆవృషభము తన కొమ్ములచే నిండ్లను భవనములను గూల్చి వేయసాగెను. దాని అంకెలతో వ్రజవాసులందరు భీతావహులైరి. శ్రీకృష్ణుడా రాక్షసుని కొమ్ములు విరచి వానిని పొడిచి చంపి వేసెను. అరిష్టాసురుని మరణానంతరము దేవర్షి నారదుడు కంసుని వద్దకు వెళ్ళి శ్రీకృష్ణ బలరాములిద్దరూ వసుదేవుని కుమారులే యనియు వారిని నందుని వద్ద దాచి యుంచెననియు దెల్పెను. కంసుడు క్రోధముతో దేవకీ వసుదేవులను మరల బందీలు గావించి కారాగృహమున బడవైచెను. శ్రీకృష్ణుని సంహరించుటకై యీ మారు అందరి కన్న బలవంతుడైన 'కేశి' యను రాక్షసుని బృందావనమునకు బంపెను.

'కేశి' యశ్వరూపమును ధరించి ఒకనాటి ఉదయముననే బృందావనమున ప్రవేశించెను. ఆకారమందున నేనుగు కంటె పెద్దదై, మాటి, మాటికి ఎంతో పెద్దదైన నోరును తెరచుచు క్రూరముగ, నతి భయంకరముగ సకిలింపుచున్న నల్లని గుఱ్ఱమును జూచి యందరు భయముతో తలుపులు వేసుకొన సాగిరి. మందలు చెల్లాచెదురై ఇటునటు పరుగెత్తుచుండెను. శ్రీకృష్ణ భగవానుడు కేశిని కవ్వించెను. వాడునూ కృష్ణునికై వెదకుచుండెను. శ్రీకృష్ణుని జూడగనె ఆ రాక్షసుడు నోరు దెరచుకొని వాని వైపు పరుగెత్తి రాసాగెను. భగవానుడు తన కుడిచేయిని తెరచియున్న వాని నోటిలోనికి పోనిచ్చెను. దానితో వాని దంతము లన్నియు నూడి క్రింద పడెను. చేయి పరిమాణము పెద్దది కాసాగెను. దానితో వాని శరీరము వర్షాకాలమందలి

నీటి బుడగ వలె పగిలిపోయెను. కేశి మరణించెను. దేవతలందరు ఎంతో సంతుష్టులయి శ్రీకృష్ణుని పై పుష్ప వర్షము గురిపించి జయ జయ ధ్వానములు జేయసాగిరి.



# 10. గోకులమునుండి మధురకు

శ్రీకృష్ణునిచే తన మరణము తథ్యమని దెలిసిన నాటి నుండి కంసునికి కంటినిండ నిదుర లేదు. ఏ విధముగ నయినను బలరామ కృష్ణుల మధురకు రప్పించి సంహరింపవలెనని దలంచి అక్రూరుని (నందగోకులము) బృందావనమునకు బంపెను. మధురలో జరుగనున్న ధనుర్యాగమునకు, నందాదులనెల్లరను తోడుకొని రమ్మనెను. అక్రూరుడు భగవద్భక్తుడు, భక్తులలో శ్రేష్ఠుడు, శ్రీకృష్ణ భగవానుడు దుష్ట రాక్షస సంహారమునకై యవతరించెనని యెరుగును. బలరామ కృష్ణులకు కంసుని కుతంత్రము తెలియజేసెను. బలరామకృష్ణులు అక్రూరుని రథము నెక్కిరి. నందాది, బృందావన వాసులు తమ తమ శకటములలో బయలు దేరిరి. మధురానగర సమీపమున నున్న ఉద్యాన వనమున తమ బండ్ల నాపి అచట విశ్రమించిరి. శ్రీకృష్ణబలరాములు నందుని తోడుగా నుండిరి. అక్రూరుడు రథముతో మధుర జేరెను.

భోజనానంతరము కొంత తడవు విశ్రమించి బలరామకృష్ణులు గోకులమునుండి వచ్చిన ఇతర బాలకుల గూడి మధురానగరమును దర్శించుటకై బయలు దేరిరి. నగరములో ప్రవేశించుచుండగా కంసుని వస్త్రముల శుభ్ర పరచు రజకుడు (చాకలి) గన్పించెను. తాము ధరించుటకై తగిన దుస్తుల నొసగుమని కృష్ణుడు కోరెను. కానీ ఆ రజకుడెంతో గర్వి. దుష్టుడు. వాడు శ్రీకృష్ణుని దుర్భాషలాడ దొడగెను. ఒకే ఒక చెంప దెబ్బతో నా రజకుని మట్టి గరపించెను. వానితో నున్న మిగిలిన చాకలి వారు భయముతో దమ మూటల నక్కడే వదిలి పారిపోయిరి. అందరు తమకు నచ్చిన దుస్తుల ధరించిరి. ఆ దుస్తులన్నియు వారి కొలతలలో

కుట్టినవి గావు. కొన్ని చిన్నవిగాను, మరి కొన్ని పెద్దవిగా నయ్యెను. ఇంతలో నొక బట్టలు కుట్టువాడు వారి వారి కొలతలతో దుస్తులు తయారు జేసి యిచ్చెను. తరువాత వారు సుదాముడను మాలిని గలిసిరి. సుదాముడు కృష్ణ భక్తుడు. అతడు ప్రేమతో బలరామకృష్ణులందరినీ పుష్పమాలాంకృతులుగా జేసెను. ★ భగవానుడు వానికి తన యందు భక్తి నిలచు నట్లుగా వరమిచ్చెను.

కంసుని దాసి కుబ్జ. ఆమె కంసునికై చందనాది లేపనముల దీసుకొని రాజభవనమునకు వెడలు చుండెను. ☆ ఆమె బలరామకృష్ణుల గాంచగనే భక్తితో వారి శరీరములపై చందనాది సుగంధ ద్రవ్యముల లేపనము

---

**★ కం!! నీపాదకమలసేవయు, నీ పాదార్చకులతోడి నెయ్యమును నితాం**
**తాపారభూతదయయును తాపసమందార నాకు దయసేయ** గదే.

(శ్రీ బమ్మెరపోతన భాగవతము 10/268)

"తాపసుల కోరికలు దీర్చుట యందు కల్ప వృక్షము వంటి వాడవైన ఓ కృష్ణా! నీ పాదారవింద మందు భక్తి, నీ పాదములర్చించువారి స్నేహము, ప్రాణుల యందు దయ నాకు నను గ్రహించు"మని వేడుకొనియె. ఎంతటి మధుర భావన యీ భక్తుని ప్రార్థనము.

**☆ కం!! ఎవ్వరిదానవు లేపము, లెవ్వరికీగోరి కొనుచు నేగెదు నీపే**
**రెవ్వరు మాకిమ్మన్నియు, నివ్వటిలదె చక్కనగుచు నీరజనేత్రా**

(శ్రీ బమ్మెరపోతన భాగవతము 10/1176)

తా!!లేపనముల కంస భూపతికి సమర్పింపగా నేగు కుబ్జను చూచి శ్రీకృష్ణ పరమాత్మ 'కమలముల వంటి కన్నుల గలదానా! నీ వెవరికి సంబంధించిన దానవు. నీ పేరేమిటి? ఎవరికీయవలెనని ఈ పూసుకొను పరిమళ ద్రవ్యంబుల గొని పోవుచున్నావు. ఇవి యన్నియూ మాకిచ్చినచో నీవు వంకరలు తీరి చక్కని దాని వగుదువు గాన ఇవి మాకిచ్చి పొమ్ము'. యని పల్కెను.

(గమనిక - కుబ్జను గూర్చిన మాటల యందలి అంతరార్థమును జూడుడు - 'కుత్సితం ఉబతీతి కుబ్జా' యని ఉత్పత్తి గాన కుత్సితము గలది. ఆమెయందు యోగ్యతయూ గలదు. కుబ్జా నీ వెవరి దానవో గాదు నీ దానవే, నీవు ఈ పదార్థముల పరమాత్మనైన నాకర్పింపుము. దానం జేసి నీయందలి యసంభావనాది దోషములు పోయి కృతార్థురాలవయ్యెద వనెను.)

గావించెను. శ్రీకృష్ణుడు డామె భక్తికి మెచ్చి ఆమెనతి సౌందర్యవతిగా మార్చెను. కంసుని యొద్ద శంకర భగవానుని ధనుస్సు కలదు. ఆ ధనుస్సు ఒక సుందర భవనమునందుంచి పూర్తి సంరక్షణగావించెను. ఎంతో మంది బలమైన రాక్షసులా ధనుస్సును కాపలా కాయుచుందురు. కంసుడాధనుస్సును ప్రీతితో నిత్యము పూజించును. శ్రీకృష్ణుడు, తనవారినందరిని గూడి నగర వాసుల మార్గము నడిగి తెలుసు కొని ధనుశ్శాలను ప్రవేశించెను. ధనుస్సును విరిచి వేసెను. రాక్షసుల నందరిని విరిగిన ఆ ధనుస్సుతో కొట్టి చంపెను. మిగిలిన వారందరూ కంసుని వద్దకు వెళ్ళి మొర పెట్టుకొనిరి. కంసుడు పెద్ద సేనను బంపెను. బలరామకృష్ణులు వారందరిని సంహరించిరి. సాయంసమయమగు వరకు వారందరూ తిరిగి తమ విశ్రామ స్థలముల జేరిరి. బలరామకృష్ణులు తమ సేనను సంహరించిరను వార్త విన్న కంసునకు నిద్రరాకుండెను. ఎట్లెట్లో తెల్లవారెను.

# 11. కంసవధ

కంసుడొక మల్లయుద్ధ క్రీడాస్థలి నేర్పరచి. దానిని తగురీతిగ నలంకరింపజేసెను. మరునా డుదయమున తాను రాజ సింహాసనము నలంకరించెను. నందుడు, మరియు నితర గోపాలకులు, తాము దెచ్చిన కానుకల కంసునికి సమర్పించి వారి వారి సముచిత స్థానములలో గూర్చుండిరి. దుందుభి, మృదంగవాద్యములు మ్రోగసాగెను. స్నానాదులు ముగించి గోపబాలకులను గూడి బలరామకృష్ణులు కొంత ఆలస్యముగ వచ్చిరి. కంసుని వద్ద కువలయాపీడ మను గజము కలదు. అది అరువది వేల ఏనుగుల బలము గలది. కంసుని పనుపున మావటి ఆ యేనుగునకు మద్యము త్రాగించెను. దానిని క్రీడాస్థలి ద్వారమున నిలుచుండ బెట్టెను. బలరామకృష్ణులా ద్వారము వద్దకు రాగానే, ఆ యేనుగును అంకుశములతో బొడిచి వారి మీద కుసి గొలిపిరి. బలరామకృష్ణులు తమ ముష్టి ఘాతముల దాని నలసి పోవునటుల కొట్టిరి. శ్రీకృష్ణుడు దాని తొండము బట్టి నేలకు

విసిరి కొట్టెను. తరువాత దాని పొడవైన దంతములు బెరికి మావటి వారిని తుదకు నా కువలయమును సంహరించిరి.

కువలయాపీడము యొక్క దంతములు చెరియొక భుజముమీద నిడుకొని రామకృష్ణులు క్రీడాస్థలి ప్రవేశించిరి. చాణూర ముష్టికులు ఎంతో బలవంతులు, పేరు మోసిన మల్ల యోధులు. శ్రీకృష్ణుడు చాణూరునితోను, బలరాముడు ముష్టికునితోను తలపడిరి. శ్రీకృష్ణ బలరాములిరువురు పర్వతాకారులయిన వారిద్దరి శరీరములను పిడికిళ్ళతో గొట్టి సంహరించిరి. శ్రీకృష్ణుని చేత చాణూరుడు బలరాముని చేత ముష్టికుడు మరణించగనే కూటుడను మల్లుడు బలరాము నెదుర్కొని బలరాముని చేత సంహరింప బడెను. వాని తరువాత శలుడు తోశలుడను వారు వీరి మీదకు వచ్చిరి. వారిరువురిని శ్రీకృష్ణుడు తన పాదములచే తొక్కి సంహరించెను. వీరిని జూచి మిగిలిన మల్లయోధులు క్రీడాస్థలి వీడి పరువెత్తి పోయిరి.

మల్లయోధులందరు మరణించుట గాంచిన కంసునికి క్రోధము హెచ్చాయెను. పిచ్చివాని వలె కేకలు వేయ సాగెను. నందుని, దేవకీ వసుదేవుల సంహరింపుడని, తండ్రియైన ఉగ్రసేనుని జంపుడని అరచుచుండెను. కాని అతని మాటలాలకించు వారెవరు లేరైరి. శ్రీకృష్ణ భగవానుడు వానిపై కొదమ సింహము వలె దూకి, కేశముల బట్టి సింహాసనము మీది నుండి క్రిందికి లాగి పడ వైచెను. ★ కంసుని మరణానంతరము నాతని యెనిమిది మంది సోదరులు కృష్ణుని సంహరింప వచ్చిరి కాని

---

★ **శా!! పక్షీంద్రుండురగంబు బట్టువిధమొ, ప్పం గేశబంధంబు లో**
**కక్షోభంబుగ బట్టి మౌళి మణులా, కల్పాంత వేళా పత**
**న్నక్షత్రంబులభంగి రాల రణసన్నాహంబు డిందించి రం**
**గ క్షోణిం బడ ద్రొబ్బె గృష్ణు(డు వెసం, గంసు నృపోత్తంసునిన్,**

(శ్రీ బమ్మెర పోతన భాగవతము 10/1373)

తా!! గరుడుడు పామునుబట్టి నట్లు శ్రీకృష్ణ మూర్తి రాజశ్రేష్ఠుడైన కంసుని కొప్పు బట్టి లోకులు భయంబుతో చూచుచుండ కంస కిరీట రత్నములు ఆకసము నుండి రాలు చుక్కల వలె రాలుచుండగా వాని యుద్ధంబు నాపి శీఘ్రంబుగ నీడ్చి భూమిపై పడద్రోసెను. సింహము చూపుల చిన్నదైననూ ఏనుగును పడవైచి సంహరించు రీతి, చూపరుల నాశ్చర్యపరచు నట్లు కంసుని సంహరించె.

బలరాముడు వారినందరినీ సంహరించెను. శ్రీకృష్ణ భగవానుడు తన తల్లిదండ్రులైన దేవకీ వసుదేవుల బంధవిముక్తుల జేసి వారి పాదములపై బడెను. ఎన్నియో దినముల తరువాత కనుపించిన కుమారుని గాంచిన వారి యానందమున కవధులు లేకుండెను. శ్రీకృష్ణుడు తన తాత ఉగ్రసేనుని చెర విడిపించి తిరిగి మధురానగరమునకు మహారాజుని జేసెను. దుష్టుడైన కంసుని మరణము, ఉగ్రసేనుని రాజ్యపాలన, యాదవుల నందరి దుఃఖముల దూరము జేసెను.

నందునకు మరియు మిగిలిన గోపాలకులందరికీ శ్రీకృష్ణ బలరాములు దేవకీ వసుదేవుల కుమారులని యవగతమైనది. శ్రీకృష్ణ భగవానుడు నందున కెన్నియో కానుకల నత్యంత ప్రీతితో నొసగెను. మధుర నుండి చాల దూరము వరకు వెంట నుండి వీడ్కోలొసగెను. శ్రీకృష్ణుడు వెంట రాకుండ తిరిగి వచ్చిన నందాదులను జూచి గోపగోపికలందరు నెంతయో దుఃఖించిరి. శ్రీకృష్ణుని జ్ఞాపకము వారు సదా మరువలేకుండిరి. ఎల్లప్పుడు భగవానునే దలంచుచు వాని కిష్టమైన పనులనే జేయసాగిరి. వ్రజ వాసులెంత ధన్యులు. వారే భగవద్భక్తులలో సర్వ శ్రేష్టులు.

# ఉత్తరార్థము

## 12. గురుదేవునియాశ్రమము

ఆ రోజులలోని విద్యాభ్యాసము నేటివలె పాఠశాలలు మరియు విశ్వ విద్యాలయము లందు జరిగెడిది గాదు. బ్రాహ్మణ క్షత్రియ, వైశ్య బాలకులు తమ యుపనయనము తరువాత విద్యాభ్యాసమునకై గురుకులమునకేగెడి వారు. ఋషుల ఆశ్రమము నగరమునకు దూరముగ నడవిలో నుండెడిది. అచ్చట రాజకుమారుడైనను, దరిద్రుడైనను అందరు సమానమే. అందరు గురుసేవ జేయవలసినదే. ఎవరు దేనికి యోగ్యులో నిర్ణయించిన తరువాతనే వారికి తగిన విద్య నేర్పబడెడిది.

శ్రీకృష్ణ బలరాముల కుపనయన సంస్కారము గావింప బడెను. నడుమునకు గట్టిన ముంజనందు కౌపీన వస్త్రములు ధరించి, చంకలో మృగచర్మము చుట్ట బెట్టి చేతి యందు పలాశదండము బట్టి బ్రహ్మచారి వేషధారులై అవంతికాపుర సమీపమున నున్న సాందీపనిముని యాశ్రమమున విద్య నభ్యసించుటకై వెడలిరి. కాశీనగరము సాందీపని జన్మభూమి. అవంతికాపుర సమీపమున తన యాశ్రమము నిర్మించు కొనెను. దూర దూరముల నుండి విద్య నభ్యసించుటకై సాందీపుని యాశ్రమమునకు విద్యార్థులు వచ్చు చుందురు.

బ్రహ్మ చర్యవ్రత మతి కఠోర మైనది. విద్యార్థులు బ్రహ్మ ముహూర్తము ననె మేల్కాంచి శౌచాది కార్యక్రమములు ముగించ వలెను. ఆ వెనుక స్నానమాచరించి, సంధ్య వార్చి యజ్ఞము జేయవలెను. తదుపరి యాశ్రమమును శుభ్రపరిచి గురుదేవుని పూజకై ఫల పుష్పములు మరియు దర్భలు మొదలగునవి తెచ్చి సమర్పింపవలెను. సమీపముననే యున్న గ్రామమునకు పోయి భిక్ష తీసుకొని రావలెను. ఆ భిక్షనంతను గురుదేవునకు సమర్పింతురు. గురుదేవుడెంత ప్రసాదము నిడునో అంతియే గ్రహింప వలెను. ఏక భుక్తము బ్రహ్మచారుల నియమము. మధ్యాహ్న కాలమున తిరిగి స్నాన మాచరించి సంధ్య వార్చిన వెనుకనే భుజించ వలెను. గురుదేవులు విశ్రమించునపుడు వారి పాద సేవ జేయవలెను. ఆ సమయము నందే గురువులు వారికుపదేశము జేయుదురు. పగలు నాలుగవ జామున(4గం॥ నుండి 6గం॥ వరకు) అడవికి పోయి హోమమునకై ఎండుకట్టెల నేరుకొని రావలెను. సంధ్యా సమయమున తిరిగి స్నాన మాచరించి హోమము జేయుదురు. అర్ధ రాత్రి వరకు, గురుదేవుల సేవ చేయుచు వారి యుపదేశముల విను చుందురు. రాత్రి మూడవ జామున గాని బ్రహ్మచారి నిదురించరాదు.

బ్రహ్మచారులు పాదరక్షలు ధరించుట, తైలము రాసుకొనుట, తలదువ్వుట మొదలగునవి చేయరాదు. దర్భలు పరచుకొని భూశయనము జేయవలెను. శ్రీకృష్ణ బలరాము లిద్దరు కఠోర బ్రహ్మచర్యవ్రతమును నియమానుసారముగ నాచరించిరి. గురుదేవులకు సహ విద్యార్థులకు శ్రీకృష్ణ బలరాములన్న నెంతయో ప్రేమ. శ్రీ కృష్ణునితో బాటు సుదాముడను

నొక (బ్రాహ్మణ బాలుడు గూడా విద్యాభ్యాసము జేయుచుండెను. ఒకనాడు హోమమునకై ఎండు కట్టెల నేరి తెండని, గురుపత్ని శ్రీకృష్ణ సుదాముల నాజ్ఞాపించెను. సాయం సమయమున గాలి వాన (ప్రారంభ మాయెను. చీకటిలో వారిరువురు దారి తప్పి రాత్రి యంతయు నొక వృక్షచ్ఛాయ యందు గడిపిరి. మర్నాటి యుదయమున గురుదేవులు శ్రీకృష్ణ సుదాముల వెదకుచు నడవికి బయలు దేరి వెళ్ళిరి. వారిని గాంచి తమ శిష్యుల గురుభక్తికి నెంతయో మెచ్చి పరలోకమందైనను వారి విద్య మరపుకు రాకుండునటుల ఆశీర్వదించెను.

బలరామకృష్ణులిరువురు స్వయముగ జ్ఞాన స్వరూపులు. వారితరుల నుద్ధరించుటకై గురుకులమున జేరిరి. అరువది నాలుగు దినములలోనే అరువది నాలుగు శాస్త్రముల యందు ప్రవీణులైరి. వేదవేదాంగముల, నుపనిషత్తుల మరియు సర్వశాస్త్ర పారంగతులైరి. విద్యాభ్యాసము ముగిసినది. గురుదక్షిణ నొసగుటకై బలరామకృష్ణులు సాందీపని సమీపించి పాదాభివందనము గావించి గురుదక్షిణగనేమి కావలయునో తెలుపుమనిరి. శ్రీకృష్ణ బలరాములిరువురు సాక్షాత్ భగవత్స్వరూపులని సాందీపనిడు గ్రహించెను. ప్రభాసతీర్థమున స్నానమాచరించుచు సముద్రమున మునిగి పోయిన తమ పుత్రుని గురుదక్షిణగా సమర్పింపుడని కోరెను.

బలరామకృష్ణులిరువురు రథమునందు గూర్చుండి ప్రభాస తీర్థమునకు బయలుదేరిరి. వారిని జూడగనే సముద్రుడొక బ్రాహ్మణ వేషధారియై అనేక రత్నముల కానుకగ గొని వారి స్వాగతమునకై విచ్చేసెను. పాంచజన్యుడను రాక్షసుడు గురుపుత్రుని మింగి యుండ వచ్చునని తెలియజేసెను. శంఖమున నుండు ఆ రాక్షసుని కృష్ణుడు సంహరించి పాంచజన్యమను శంఖమును తాను గైకొనెను. వాని గర్భమున గురుపుత్రుని గానక యమలోకమునకు ప్రయాణమయ్యెను. యమధర్మరాజు నుండి గురుపుత్రుని దోడ్కొని సాందీపునకు గురుదక్షిణ సమర్పించెను. తదుపరి గురువునాజ్ఞగొని బలరామకృష్ణు లిరువురు మధురకు తిరిగి వచ్చిరి.



# 13. మధురనుండి ద్వారకకు

జరాసంధు డెంతో బల పరాక్రమము గల రాజు. వాని కుమార్తెలను కంసుడు వివాహ మాడెను. అల్లుడు కంసుని మరణ వార్త విన్న జరాసంధుడు క్రోధితుడై ఇరువది మూడక్షౌహిణుల సేనతో మధురానగరముపై దండెత్తెను. నగరమును జుట్టు ముట్టెను. తన నగరమును శత్రు సేనలు చుట్టి ముట్టిరన్న వార్త విని బలరామకృష్ణులు రధారూఢులై తమకున్న కొద్ది సైన్యముతో నగరము వెలుపలకు వచ్చిరి. ఇరుసేనల మధ్య భయంకర మైన పోరు సాగెను. జరాసంధుని సైనికులందరు దాదాపు కృష్ణ బలరాముల చేతులలో సంహరించబడిరి. బలరాముడు జరాసంధుని బందీగ జేసెను. కానీ కృష్ణుడు వానిని శిక్షింపకయే విడిచి పుచ్చెను. జరాసంధుడు తిరిగి మధురపై దండెత్తెను ఈవిధముగ నతడు పదు నేడు మారులు మధురపై తన ఇరువది మూడక్షౌహిణుల సేనతో దాడి జరిపెను. కానీ ప్రతి మారు శ్రీకృష్ణుడు వానినోడించి విడిచి పుచ్చు చుండెను.

పదునెనిమిదవ మారు జరాసంధుడు మధురను ముట్టడింప ప్రయత్నము జేయ సాగెను. అదే సమయమున కాలయవనుడను రాక్షసుడు తన మూడు కోట్ల మ్లేచ్ఛ సేనతో మధురా నగరమును చుట్టు ముట్టెను. కాలయవనుడు మహావీరుడు వానినోడించు వీరు డెందును కాన రాలేదు. 'శ్రీకృష్ణుడొక్కడే నీతో తలపడి యుద్ధము జేయ' గలవాడని దేవర్షి నారదుడు కాలయవనునికి తెలియ జేసెను. తాను కాలయవనునితో యుద్ధము జేయుచుండ జరాసంధుడు మధురానగర ప్రజల బాధించునని శ్రీకృష్ణుడాలోచించెను.

విశ్వకర్మను రావించి రాత్రికి రాత్రియే సముద్రగర్భమున నొక సుందర నగర నిర్మాణము గావించెను. అదియే ద్వారకనగరము. మధుర వాసులందరూ తగురీతి వాసము జేయుటకు సుందరమైన భవనములు, ఉద్యానవనములు, మరియు చక్కని రాచ బాటలు, నిర్మింప బడినవి. శ్రీకృష్ణ భగవానుడు తన మాయతో మధుర వాసులను, పశు సంపదను, వస్తు సామగ్రిని సర్వమును క్షేమముగ ద్వారక చేర్చెను.

మరునాటి యుదయమున శ్రీకృష్ణుడు పాద చారియై నగరమును దర్శించుటకై బయలు దేరెను. ఏ ఆయుధము ధరింపక నొంటరిగ పాదచారియై వచ్చుచున్న శ్రీకృష్ణుని జూచి తన ఆయుధముల రథము నందే నునిచి కాలయవనుడు తాను గూడ పాదచారియై అనుసరించెను. నిరాయుధుల మీద అస్త్ర ప్రయోగము జేయుట రణనీతి గాదు. కాలయవనుని చూడగనే శ్రీకృష్ణుడు పరువెత్తనారంభించెను. కాలయవనుడు కృష్ణుని వెంబడించెను. కొంత దూరము పరువెత్తి శ్రీ కృష్ణుడు తటాలున నొక కొండగుహలో జొచ్చెను. కాలయవనుడు గుహాంతర్భాగమున వెదుకగ నెవరో పీతాంబరమును గప్పుకొని నిదురించుచు కన్పట్టెను. తనను మోసగించుటకై శ్రీకృష్ణు డీరీతి నిదుర నటించుచున్నాడని కాలయవనుడు తలచి వాని తల కాలితో తన్నెను. నిద్రా భంగమైనందున క్రోధించిన ముచికుందుడు కనులు దెరచి ఎదుటనున్న కాలయవనుని వైపు దృష్టి సారించెను. ఆ చూపులకు కాలయవనుడు భస్మమై పోయెను.

అచట నిదురించుచున్న యోగి ముచికుందుడు. సత్య యుగమున దేవతల పక్షమున నుండి యెందరో రాక్షసులతో యుద్ధము జేసి వోడించెను. రణము నందలసిపోయిన ముచికుందుడు తాను విశ్రమింప దలచి దేవతలచే తనకు నిద్రాభంగమొనరించిన వారు తన చూపు సోకగనే భస్మమైపోవునటుల వరము గొని కొండ గుహయందు నిద్రించు చుండెను. ముచికుందుని నిద్రాభంగమొనరించిన కాలయవనుడు భస్మమై పోయెను. శ్రీకృష్ణుడు కరుణించి ముచికుందునకు దివ్య దర్శన మొసగెను. ముచికుందుడు భగవాను నెన్నియో విధముల స్తుతించి ఆయన అనుజ్ఞ గైకొని తపస్సొనరించు కొనుటకై హిమాలయముల కేగెను.

బలరామకృష్ణులిరువురు కాలయవనుని సేనల సంహరించి ద్వారకకు మరలుచుండ నిదియే తగిన సమయమని జరాసంధుడు తన సైన్యముతో వచ్చెను. శ్రీకృష్ణ బలరాములిద్దరు జరాసంధుని జూడగానే పారిపోసాగిరి. జరాసంధుని సేనలు వారిని వెంబడించెను. బలరామ కృష్ణులిరువురు నొక పర్వత శిఖరము నెక్కి గూర్చుండిరి. జరాసంధుడు వారెచ్చట యున్నదీ కనుగొన జాలక పర్వతము చుట్టును ఎండు కట్టెలతో మంట పెట్టించెను. ఆమంటల బడి శ్రీకృష్ణ బలరాములిర్వురు మరణింతురని యెంచి తాను

మగధకు తిరిగి వెళ్ళెను. రామకృష్ణు లిర్వురు శిఖరాగ్రము నుండి దుమికి దారుకుడు సిద్ధమొనర్చిన రథము నెక్కి ద్వారక జేరిరి. నాటినుండియే శ్రీకృష్ణునకు 'రణభీరువు' 'రణమున వెన్నిచ్చిన వాడు' యని పేరు వచ్చినది.

## 14. వివాహము

రైవత రాజ పుత్రి రేవతిని బలరాముడు పరిణయమాడెను. విదర్భ దేశపురాజు భీష్మకుడు తన కుమార్తె రుక్మిణీ దేవి వివాహమును శ్రీకృష్ణునితో జరుప నిశ్చయించెను. కాని అతని పెద్ద కుమారుడైన రుక్మి తన సోదరి వివాహము శిశుపాలునితో నిశ్చయించెను. తల్లి దండ్రులు రుక్మిమొండి పట్టును కాదన లేక వివాహమునకు తరలి రమ్మని శిశుపాలునాహ్వానించిరి. రుక్మిణీ దేవి మొదటి నుండియు శ్రీకృష్ణ భగవానుని ప్రేమించి పతిగా భావించినది. శిశుపాలునితో తన వివాహ సన్నాహముల జూచి నొక బ్రాహ్మణుని ద్వారా శ్రీకృష్ణునకు సందేశ మంపినది. రుక్మిణీ దేవి సందేశము నందుకున్న శ్రీకృష్ణుడు వెంటనే విదర్భకు ప్రయాణమయ్యెను. తన సేనతో బలరాముడు తమ్ముని అనుసరించి (వెనుకనే) విదర్భ జేరెను. శిశుపాలుని వివాహ మహోత్సవమునకు, జరాసంధుడు మరియు సాళ్వుడు మొదలగు రాజులు విచ్చేసిరి. వివాహమున కొకదినము ముందుగ రుక్మిణీ దేవి రాచనగరు వెలుపల నున్న పార్వతీ దేవిని పూజించుటకై గుడికి బయలు దేరినది. పూజాదులు ముగించుకొని తిరిగి వచ్చు సమయమున శ్రీకృష్ణుడు తన రథమును దెచ్చి నచ్చట నాపి రుక్మిణీదేవికేలు పట్టి తన రథమందు గూర్చుండ బెట్టుకొని ద్వారకకు మరలెను.

శ్రీకృష్ణు నడ్డగించుటకై శిశుపాలుడు మరియు వాని మిత్రులు జరాసంధ, సాళ్వులు తమ రథములలో సేనలతో బయలు దేరిరి. బలరాముని యాదవ సేనలు వారినందరినీ ఓడించి తరిమి వేసిరి. బలరాముని చేత నోడిన రాజు లందరు తమతమ దేశములకు తిరుగు ముఖము బట్టిరి. రుక్మిని శ్రీకృష్ణుడు చంపక కేవలము పరాభవము గావించి విడిచి పుచ్చెను. శ్రీరుక్మిణీ

శ్రీకృష్ణుల వివాహము ద్వారక యందు యథావిధిగా జరిగినది. రుక్మిణీ దేవియే గాక, సత్యభామ, జాంబవతి, భద్ర, మిత్రవింద, కాళింది, నాగ్న జితిమరియు లక్షణయను నేడుగురు కన్యల వివాహ మాడెను. శ్రీకృష్ణుడు తన యష్ట భార్యలతో ద్వారక యందు సుఖించు చుండెను.

# నరకాసురవధ

పృధ్వి మాత పుత్రుడు నరకాసురుడు భూదేవి పుత్రుడగుటచే వీనిని భౌమాసురుడని గూడ యందురు. ఇతడొక దుష్టరాక్షసుడు. ఎంతోమంది రాజుల నోడించి వారి పుత్రికల చెరబట్టెను. ఈ విధముగ నొక లక్షమంది కన్యల సేకరించి వారందరినీ వివాహమాడవలెనని తలంచెను. నరకుడు దేవతల తల్లియైన అదితి కుండలముల, మరియు వరుణుని ఛత్రమును అపహరించెను. దేవరాజైన ఇంద్రుడు దుష్టుడైన నరకుని సంహరింపుమని శ్రీకృష్ణుని ప్రార్థించెను. ఎందువలనన నరకాసురుని కోట దుర్భేద్యమైనది. సురక్షిత మైనది మరియు పటిష్ఠమైనది. దానిని ముట్టడించుట దేవతల కెవ్వరికినీ సాధ్యము గాలేదు. నరకాసురుని రాజధాని ఎత్తైన పర్వతముల మధ్య గలదు దాని చుట్టు నెన్నియో కందకములు గలవు. ఒక కందకము నుండి యస్త్రములు తమంతతామే సంధింప బడును. మరొకటి యగ్ని కందకము, వేరొకటి నీటి కందకము దీనినే 'మురపాస' యని యందురు. ఇంద్రాది దేవతల మొరల నాలకించి శ్రీకృష్ణ భగవానుడు, సత్యభామతో గూడి గరుడారూఢుడై నరకాసురుని రాజధాని నగరము జేరుకొనెను. తన గదాయుధముతో పర్వతముల ఛేదించి ప్రవేశమార్గ మేర్పరచెను. తన సుదర్శనముతో నన్ని కందకముల ధ్వంసము జేసెను. శ్రీకృష్ణు డలసిన వేళ సత్యభామ ధనుర్ధారియై ★నరకాసురునితో పోరు సాగించెను. సేద దేరిన తరువాత శ్రీకృష్ణుడు నరకాసురుని సంహరించెను. లోక కంటకుడయిన రాక్షసుడు మరణించి నందులకు అందరూ పండుగ జేసుకొనిరి అదియే దీపావళి. నరకుడు చెరబట్టిన పదియారువేల ఒక వంద మంది రాజ

కన్యలను తాను వివాహ మాడెను. భగవానుడు దయామయుడు అనాథ నాథుడు.

నరకాసురుని సంహారము జేసిన అనంతరము శ్రీకృష్ణుడు తన భార్య యగు సత్యభామను గూడి, అదితి కుండలములిచ్చుటకై స్వర్గరాజ్యమున కేగెను. అచట నుండి తిరిగి వచ్చునపుడు సత్యభామా దేవి ఇచ్ఛపై పారిజాత వృక్షమును పెకలించి గరుడుని మూపుపై నిడెను. నందనవనములో నున్న దేవ పారి జాత పుష్పములన ఇంద్రాణి కెంతయో ప్రీతి శ్రీకృష్ణుడు మరియు ఇంద్రాది దేవతల మధ్య పోరు సాగినది. దేవతలు పరాజితులయిరి. ద్వారకనగరమునకు తిరిగి వచ్చిన శ్రీకృష్ణుడా పారిజాత వృక్షమును సత్యభామా దేవి పెరటిలో నాటించెను.

# 15. శ్రీకృష్ణ బలరాముల పరాక్రమము

ప్రహ్లాదుని ప్రపౌత్రుడు మరియు దైత్యరాజయిన బలి చక్రవర్తి కుమారుడు బాణాసురుడు. వేయి హస్తములు గలవాడు. చాల బల వంతుడు. వాడు తన తపస్సుతో శంకర భగవానుని మెప్పు పడసెను.

★ సీ!! **రాకేందు బింబమై రవి బింబమై యొప్పు, నీరజాతేక్షణ నెమ్మొగంబు**
**కందర్పకేతువై ఘనధూమకేతువై. యలరు పూబోడి చేలాంచలమ్ము.**
**భావజు పరిధియై ప్రళయార్కపరిధియై, మెరయునాకృష్టమై మెలతచాప**
**మమృతప్రవాహమై యనలసందోహమై, తనరారు నింతిసందర్శనంబు.**

ఆ!! **హర్షదాయియై మహారోష దాయియై పఱచు ముద్దరాలిబాణవృష్టి**
**హరికినరికి జూడ నందందశృంగార, వీరరసములోలి విస్తరిల్ల.**

తా!! యుద్ధమొనరించు సత్యభామ హరి కొక్కరీతిగనూ, అరి యైన నరకుని కొక రీతిగనూ కన్పించుచుండె. శ్రీకృష్ణునకు మోమునిండు చంద్ర బింబము గను, పైట మన్మధ టెక్కిముగను, మన్మధుడావరించిన తెర చీరగనూ, అమృత ప్రవాహముగనూ, సంతోషముగనూ, తోచుచుండగా, శత్రు వైన నరకాసురునకు ప్రళయ కాలపు సూర్య బింబము గనూ, పైట అరిష్టము దెల్పు తోక చుక్క గనూ, ప్రళయ కాల సూర్యుని వలెను, అగ్ని వాహముగనూ, రోషము గనూ కన్పట్టెను.

శంకర భగవానుడు ఎల్లప్పుడు వాని నగరమును కావలి కాయు చుండును. బాణాసురుని కుమార్తె ఉషా సుందరి. స్వప్నమందు శ్రీకృష్ణుని మనుమడైన అనిరుద్ధుని గాంచి ప్రేమించినది. అతనినే పతిగా నెంచినది. ఉషాసుందరి ప్రియసఖి తన యోగ విద్యచే నిదురించుచున్న అనిరుద్ధుని ద్వారక నుండి మాయ జేసి తెచ్చినది. తన పుత్రిక ఉషా సుందరి మందిరమున శ్రీకృష్ణుని మనుమడు అనిరుద్ధకుమారుడున్నాడని తెలిసి బాణాసురుడాతని బంధించి కారాగారమున వేసెను. దేవర్షి నారదుని వలన సమాచారము నందు కొన్న బలరామకృష్ణులిరువురు దండెత్తి వచ్చిరి. శంకర భగవానుడు తన భూత ప్రేతములతో యుద్ధ సన్నద్ధుడైనాడు.

శ్రీకృష్ణ భగవానుడు, భూత ప్రేతములన్నిటిని పార ద్రోలి శంకరునిపై సమ్మోహనాస్త్రము ప్రయోగించెను. శంకర భగవానుడు మాయ యందు మునిగి యుండగా శ్రీకృష్ణుడు బాణా సురుని చేతులను నాల్గింటిని మాత్రమే మిగిల్చి మిగిలినవి ఖండించి వేసెను. నిద్ర నుండి మేల్కొనిన శంకరుడు బాణా సురుని జంప వద్దని ప్రాణములతో విడచి పుచ్చుమని కోరెను. బాణాసురుడు గర్వమడిగి తన యపరాధముల క్షమింపుమని శ్రీకృష్ణుని ప్రార్థించి తన కుమార్తె ఉషా సుందరిని, అనిరుద్ధుని కొసగి వివాహము గావించెను

సాంబుడు జాంబవతీ పుత్రుడు. ఒకనాడు స్వయంవరము జరుగుచుండగ దుర్యోధనుని కుమార్తె 'లక్ష్మణ'ను యెత్తుకొని వచ్చి రథములో కూర్చుండ బెట్టుకొనెను. ఆ కాలము నందు రాక్షస వివాహము సమ్మతే. కానీ కర్ణ, దుర్యోధనులకు సాంబుని ప్రవర్తన నచ్చలేదు. సాంబుని యుద్ధములో నోడించి బంధించిరి. విషయము దెలిసిన బలరామ దేవుడు దుర్యోధనుని నయముగ ఒప్పించుటకై ప్రయత్నించెను. మీదు మిక్కిలి వారు బలరాముని దుర్భాషలాడ దొడగిరి. బల రాముని క్రోధము కట్టలు తెగినది. ఆయన తన నాగలి మొనతో హస్తినాపురము నంతయు పెకలింప ప్రారంభించెను. దుర్యోధనాదులు భయముతో శరణు వేడిరి. సాంబుని వివాహము 'లక్ష్మణ'తో వైభవముగా జరిగెను.

కాశీ నగర సమీపమున కరూషమను దేశమును పౌండ్రకుడను రాజు పాలించు చుండెను. అతడు కాశీ రాజుని మిత్రుడు. పరమ మూర్ఖుడు. తన కున్న రెండు చేతులు గాక నధికముగ కృత్రిమ మైన మరి రెండు చేతులు ధరించి తనకు తానే వాసుదేవునిగ ప్రకటించు కొనుచుండెను. అంతటితో నాగక ద్వారకా నగరమున కొక దూతను బంపెను.-- 'నేనే భగవంతుని అవతారమును. నేనే వాసుదేవుడను. వేరొకడు లేడు. నీవు నానామమును త్యజింపుము. లేనిచో రణమునకు సిద్ధము కమ్ము'. అని సందేశము బంపెను. శ్రీకృష్ణ భగవానుడు పౌండ్రకుని, వాని మిత్రుడు కాశీ రాజును సేనా సహితముగ సంహరించెను. ఖండించిన కాశీ రాజు శిరస్సు కాశీ పట్టణము నందు బడెను. కాశీ రాజు మరణము జూచి వాని కుమారుడు సుదక్షిణుడను వాడు, పితృ హంతకుని సంహరింతునని ఘోర తపమాచరించెను. యజ్ఞ కుండము నుండి అగ్ని రూపియగు కృత్యయను రక్కసి ఉద్భవించెను. సుదక్షిణునిచే ప్రయోగింప బడి యది ద్వారకా నగరమును గాల్చి వేయసాగెను. శ్రీకృష్ణుని సుదర్శన చక్రము రక్కసిని కాశీ నగరమునకు తరిమి వేసెను. కృత్య చేయునది లేక తిరిగి తనను ప్రయోగించిన సుదక్షిణుని దహించి వేసెను.

ద్వివిదుడను వాడొక వానరుడు. రాక్షస సహవాసముచే వాడును రాక్షస కృత్యముల జేయుచు ప్రజల నెంతో బాధించు చుండెను. వాడు వనముల ధ్వంసము జేసెడి వాడు గ్రామముల దహించి వేసెను. సముద్ర జలముల పుడిసిలి బట్టి తీర ప్రాంతముల నున్న గ్రామములకు గ్రామములనే జల ప్రవాహముల గొట్టుకొని పోవునటుల జేసెడి వాడు. ద్వివిదుడొకనాడు రైవతపర్వతము వద్దకు వచ్చెను. అచట స్నానము జేయుచున్న బలరామ దేవుని గాంచి వెక్కిరించుచు వాని వస్త్రముల పీలికలుగా జేసెను. మొదట బలరాముడు దానిని రాయితో గొట్టి బెదిరింప జూసెను. కాని ద్వివిదుడొకవృక్షమును బెకలించి బలరామునెదుర్కొనజూచెను. కొద్దిసేపు యుద్ధము సాగిన వెనుక బలరాముడు వానిని తన ముష్టిఘాతములతో సంహరించెను.

ఒక దినమున దేవర్షి నారదుడు ద్వారకకు విచ్చేసి ధర్మరాజు రాజసూయ యజ్ఞము జేయ నిశ్చయించినాడని శ్రీకృష్ణునకు దెలిపెను. ఈ పృథ్విలోని

రాజులందరిను జయించిన వాడే రాజసూయమున కర్హుడు. ఆతడే సామ్రాట్టు కాగలడు. (చక్రవర్తి) శ్రీకృష్ణుని భక్తులు పాండవులు. పాండవుల తల్లి కుంతీ దేవి శ్రీకృష్ణుని మేనత్త. యుధిష్ఠిరుని రాజ సూయ సమాచారము విన్న శ్రీకృష్ణుడమితానంద భరితుడైనాడు. తన పత్నులను, పుత్రులను, మిత్రులను గూడుకొని తగు సేనతో పాండవుల రాజధాని ఇంద్రప్రస్థమునకు ప్రయాణమైనాడు. శ్రీకృష్ణుడరుదెంచినాడన్న వార్త విని ధర్మరాజు తన తమ్ములతో గూడి యెదురేగి ఘనముగ స్వాగతము బలికి తోడి తెచ్చెను.

శ్రీకృష్ణుని ఆదేశముతో, భీమార్జున నకుల సహదేవులు నలువురు నాల్గు దిక్కుల దిగ్విజయ యాత్రకై వెడలిరి. కానీ మగధ దేశపు రాజు జరాసంధుడింకను జయింపబడలేదు. ఆతడు బందీలుగా జేసిన రాజుల నందరిని చంపవలెనని గూడ యోచించుచున్నాడు. వారలందరినీ రక్షించుటకై భీమార్జునుల గూడి శ్రీకృష్ణుడు మగధ జేరెను. జరాసంధ భీమసేనుల మధ్య గదా యుద్ధము జరిగినది. భీమసేనుడు జరాసంధుని రెండు కాళ్ళను బట్టుకొని ఆతని శరీరమును నడిమికి రెండుగా జీల్చివేసెను. జరాసంధుని మరణానంతరము శ్రీకృష్ణుడాతని కుమారుడు సహదేవుని రాజ్యాభిషిక్తునిగ జేసెను. చెఱసాలలో నున్న రాజులందరినీ విడుదల గావించి వారి వారి రాజ్యముల తిరిగి ఇచ్చి వేసెను. వారందరూ ధర్మరాజుని సార్వభౌమత్వము నంగీకరించిరి. భీమార్జునుల గూడి శ్రీకృష్ణుడు ఇంద్రప్రస్థము జేరెను. రాజసూయమారంభమైనది. రాజసూయ యాగమునకు విచ్చేసిన వారందరి పాద ప్రక్షాళనము జేయు కార్య క్రమము శ్రీకృష్ణుడు తానే స్వయముగ నిర్వర్తించెను.

మహా పురుషులు కార్యములలోని యుచ్చ నీచములు లెక్కింపరు. ఏలాటి పనుల జేయుటకైనను సంసిద్ధులే. యజ్ఞమునకు విచ్చేసిన వారిని పూజింపవలయును. ప్రథమ పూజ కర్హులయిన వారెవరా యన్న ప్రశ్న ఉదయించినది. కురు వృద్ధుడు భీష్మపితామహుడు గూడా అందు విచ్చేసి యున్నాడు. గురువులు, మరియు పెద్దలున్నారు. దేవతలు మహా తపస్సంపన్నులు గూడ గలరు. కానీ తమ్ముడు సహదేవుని మాటలాలించి ధర్మరాజు యోగేశుడయిన శ్రీకృష్ణ భగవానుని పూజించుటకై యుపక్రమించెను.

ఇది అందరికి సమ్మతమే ఏలననగా శ్రీకృష్ణుడు సాక్షాత్తు దేవదేవుడు. పరమాత్ముడు అట్టి వానిని పూజించిన జన్మ చరితార్థము కాగలదు. ఆసభయందు శిశుపాలుడు గూడా గలడు. జన్మించిన దాదిగ వాడు శ్రీకృష్ణుని యందు శత్రుత్వము పెంచుకొని నాడు. శిశు పాలుడు సభయందు లేచి నిలుచుండి శ్రీకృష్ణుని పాద పూజను నిరోధించెను. పైపెచ్చు శ్రీకృష్ణుని దుర్భాషలాడ దొడగెను. శిశుపాలుని తల్లి కొసగిన వాగ్దానమునకు కట్టుబడి వాని నూరు తప్పులను క్షమించెను. శిశుపాలుడు హద్దుమీరి శ్రీకృష్ణునే జంప నుంకించగా, భగవానుడు తన చక్రాయుధముచే వాని శిరస్సును ఖండించెను.

సాల్వుడు శిశుపాలుని మిత్రుడు. ఆతడు శంకరుని గూర్చి తపమొనరించి మెప్పువడసి మయనిర్మితమైన ఒక దివ్య విమానమును వరముగ బొందెను. శిశుపాలుని మరణవార్త విని క్రోధితుడై తన విమానమందు మంచి బలమైన సైనికుల గూర్చుండ జేసి ద్వారకమీద దాడిచేసెను. శ్రీకృష్ణుని పెద్ద కుమారుడు ప్రద్యుమ్నుడు వానినెదిరించి పోరసాగెను. యుద్ధము జరుగుచుండగా శ్రీకృష్ణుడు ఇంద్రప్రస్థము నుండి తిరిగి ద్వారక జేరెను. భగవానుడు తన గదా యుధముతో వాని విమానమును చూర్ణము జేసెను. చక్రాయుధముతో వాని శిరస్సు ఖండించెను.

సాల్వుని మిత్రుడు దంతవక్త్రుడు, పర్వతాకారుడు మరియు నెంతో బలవంతుడు. సాల్వుడు మరణించగనే శ్రీకృష్ణుని సంహరించుటకై తన గదతో నాయన ఛాతీ పై బలముగ గొట్టెను. శ్రీ కృష్ణుడించు కైనను చలింపలేదు. కానీ శ్రీకృష్ణుడు తిరిగి తన గదాయుధముతో వాని ఛాతి పగుల గొట్ట దంతవక్త్రుడు నెత్తురు కక్కుకొని అచ్చటనే మరణించెను. దంతవక్త్రుని సోదరుడు విదురథుడు గూడ శ్రీకృష్ణునిచే సంహరింప బడెను. భగవానుడు దుష్ట శిక్షణ, శిష్ట రక్షణగావింపగ యవతారము లెత్తి పృథ్వీభారమును తగ్గించును.



# 16. ద్రౌపదియందుకరుణ

ఖాండవ వన దహన సమయమందు శ్రీకృష్ణుడు మయుడను దానవుని రక్షించెను. మయుడు కృతజ్ఞతా పూర్వకముగ పాండవుల కొక సుందరమైన సభా భవనమును నిర్మించి యిచ్చెను. మయసభయెంతో విచిత్రమైనది. ఆ భవనమునందున్నది లేనట్లుగను, లేనిది యున్నట్లుగను కన్పట్టును. సభామధ్యమున జలాశయమున్నట్లుగ, జలమున్నచోట నేమియు లేని ప్రదేశముగ భ్రమను గలుగ జేయును. రాజ సూయ యాగము ముగిసిన తరువాత, దుర్యోధనుడు తన సోదరులతో గలసి మయసభను వీక్షించుటకై ఏతెంచెను. అచ్చట జలాశయము లేనట్లు భ్రమింపజేయు నేల మీద కాలిడి కాలు జారి నీటిలో పడెను. అదిగన్న ద్రౌపది నవ్వసాగెను. నవ్వు నాలుగందముల చేటన్నట్లు ఈనవ్వే మహాభారత యుద్ధమునకు దారి తీసినది.

తన నపహాస్యము జేసిన ద్రౌపది మీద, మరియు పాండవుల మీద ప్రతీకారము తీర్చుకొనదలచి దుర్యోధనుడు ధర్మరాజును రప్పించి తన మామ శకుని సహాయముతో మాయాద్యూతమున నోడించెను. ధర్మరాజు జూదమునందు తన రాజ్యమును సకల సంపదలను, తుదకు తన తమ్ములను, తన భార్య ద్రౌపదిని పందెముగ నొడ్డి యోడిపోయెను. జూదము సర్వ నాశన కారి. మనుజులను భ్రష్టులను జేయును. దుర్యోధనుడు మదాంధుడయి ద్రౌపదీ దేవిని సభకీడ్చుకొని రమ్మని తన తమ్ముడు దుశ్శాసనునకాదేశమును నొసగెను. అన్న ఆజ్ఞ ప్రకారము దుశ్శాసనుడు ద్రౌపది దేవి కేశముల బట్టి నిండుసభలో కీడ్చుకొని వచ్చెను. అంతటితో నాగక యామె చీరల నొకటొకటిగా ఒలువ నారంభించెను. సభలోని పెద్దలందరు మిన్న కుండిరి. పాండవులు నిస్సహాయులు. చివరకు ద్రౌపది తన మొర విను వారెవ్వరును లేరని గ్రహించి ఆర్తజన రక్షకుడు దీన పాలకుడయిన శ్రీకృష్ణ భగవానుని ఎలుగెత్తి ప్రార్థించెను. శ్రీకృష్ణుడామె మొరాలకించి అభయమిచ్చెను. దుశ్శాసనుడెంత ప్రయత్నించినను ఆమెను వివస్త్రనుగాజేయ జాలకుండెను. ఒకదాని వెనుక

మరియొక చీర ప్రోవులు పడుచుండెను. దుశ్శాసనుడలసి పోయెను. వానికి చెమటలు పట్ట సాగెను. వాడు తన ప్రయత్నము విరమించు కొనెను. ధృతరాష్ట్రుడు పాండవులకు జూదము నందోడిన రాజ్యమును తిరిగి యిచ్చి వేసెను. కానీ దుర్యోధనుడు తిరిగి జూదమాడుటకై ధర్మరాజును పిలచెను. జూదమున నోడిపోయిన వారు పండ్రెండేండ్లు వనవాసము, ఒక సంవత్సరము అజ్ఞాత వాసము జేయ వలెనని ఒప్పంద మయినది. ధర్మరాజు తిరిగి జూదమాడి మరల నోడిపోయెను. రాజ్యభ్రష్టుడై అన్నదమ్ములతో, భార్యతో వన వాసమునకేగెను.

వన వాసము నందు గూడ దుర్యోధనుడు, పాండవులను కష్టముల పాలొనరించ సాగెను. ఒకమారు దుర్యోధనుడు, తమ సేవలతో దుర్వాసమునిని మెప్పించి, - 'తాము తమ శిష్యసమేతముగా మధ్యాహ్న సమయమందు ద్రౌపది భుజించిన తరువాత పాండవుల వద్దకు భోజనమునకై వెడలుడు.' యని ప్రార్థింప దుర్వాసముని వాని మాటల మన్నించెను.

ధర్మరాజు సూర్య భగవానుని ప్రసన్నునిగ జేసుకొని యొక అక్షయ పాత్రను సంపాదించెను. ద్రౌపది భుజించునంత వరకు పాత్ర నిండుగ నుండును. ఆమె భోజనము చేసిన తరువాత పాత్ర ఖాళీ యగును. దుర్యోధనునకీ విషయము దెలియును. కోపదారియైన దుర్వాసముని, తన పదివేల శిష్యులతో సరియైన ఆతిథ్యము పొంద లేక పాండవులకు శాపమిడునని, దుర్యోధనుడు యోచించెను.

దుర్వాసముని తన పది వేల శిష్యులతో యుధిష్ఠిరుని వద్దకు వెళ్ళి తమకై భోజనము తయారు జేయించుమని దెల్పి తాను శిష్య సమేతముగ స్నానమాచరించుటకై వెడలెను. ద్రౌపది భోజనము ముగించినది. పాత్ర ఖాళీ యయినది. దుర్వాసుని కోపమందరికి తెలియును. ఈక్లిష్ట పరిస్థితి నుండి దరి జేర్చు వాడు శ్రీకృష్ణ భగవానుడు ఒక్కడే. ద్రౌపదీ దేవి భగవానుని ప్రార్థించినది. వెంటనే శ్రీకృష్ణుడచ్చటికి వచ్చెను. తన కాకలిగనున్నదని, అన్నమిడుమని ద్రౌపదిని కోరెను. ద్రౌపది వద్దనేమియు లేదు. శ్రీకృష్ణుడు సూర్యభగవానుడిచ్చిన 'అక్షయ పాత్ర'ను దెప్పించెను. దాని యడుగున నంటి యున్న పిసరంత కూరాకును దీసి దీనిచే

సంపూర్ణవిశ్వమంతయు తృప్తిజెందుగాక'. అని తాను భుజించెను. స్నాన మాడుచున్న దుర్వాసుని శిష్యులందరి కడుపులు నిండిపోయెను. పాండవులు శ్రీకృష్ణ భక్తులు వారు తయారు చేసిన భోజనము తినని యెడల మనకు శాపమిడుదురు. భుజించవలెనన్న భుక్తాయాసముగ నున్నది. ఇచ్చటి నుండి మరలి పోవుటయే ఉత్తమమైన మార్గము అని నిశ్చయించి దుర్వాసుడు శిష్య సమేతముగా తిరిగి చూడకుండా పారిపోయెను.

# 17. భక్తులపైకృప

త్రేతాయుగమున నృగమహారాజుండెడి వాడు. అతడెంతయో దానగుణము గల వాడు. ప్రతి దినము లక్షలాది యావులను బ్రాహ్మణులకు దానమొసగెడి వాడు. ఒకనాడొక బ్రాహ్మణుని ఆవు తప్పించుకొని నృగ మహారాజు మందలో కలిసిపోయినది. అది తెలియని నృగమహారాజు దానిని వేరొక బ్రాహ్మణునకు దానమిచ్చెను. దాన మిడిన గోవును తిరిగి తాను గ్రహించుటచే నాతడు ద్వారకానగర సమీపమున నున్న యొక బావిలో నూసరవిల్లిగ మారి పడి యుండెను. ఒక దినము ద్వారక యందున్న కొంత మంది బాలురు, ఆటలాడు కొనుచు నా బావి వద్దకు వచ్చిరి. బావిలో నున్న ఊసర వెల్లిని వెలికి దీయుటకు ప్రయత్నించసాగిరి. కానీ పెద్దదైన దానిని వెలుపలకు తీయుట సాధ్యము కాలేదు. వారందరు శ్రీకృష్ణుని యొద్దకు పరువెత్తి పోయిరి. భగవానుడు ఆ వూసరవెల్లిని తీసి బయటకు వేసెను. భగవానుని చేయి సోకగనే నృగమహారాజు పాపము శమించి దేవతా రూపము దాల్చి భగవానుని యనుజ్ఞతో స్వర్గలోకమున కేగెను.

శ్రీకృష్ణుడు గురుకులమున సాందీపని యొద్ద విద్యాభ్యాసము జేయునపుడు సుదాముడను బ్రాహ్మణ బాలకుడు గూడ చదువు నేర్చుకొనుచుండెడి వాడు. తరువాత సుదాముని (కుచేలుడు) వివాహము జరిగినది. కుచేలుడతి బీదవాడు. బీదరికమునకు తోడు, అధిక సంతానము.

వారికి తినుటకు తిండియు కట్టు కొనుటకు సరియైన వస్త్రములు లేవు. కేవలము చిరిగిన పీలికలు (జీర్ణవస్త్రములు) పగిలిన పాత్రలు చిరిగిన చాపలు మాత్రమే గలవు. సుదాముని భార్య పతివ్రత. ఉన్నదానిలో భర్తకు, పిల్లలకు మాత్రమే తినిపించి తానాకలితో ఉపవాసము జేయు చుండును. తన భర్త సుదాముని శ్రీకృష్ణ భగవానుని దర్శించి రమ్మని యెన్నియో మార్లు ప్రార్థించుచుండెడిది. తన భార్య మాట మన్నించి సుదాముడు ఒక చిరిగిన యుత్తరీయమున నాలుగు గుప్పిళ్ళ అటుకులు, మూటగట్టుకొని ద్వారకకు బయలు దేరెను.

సుదాముడు తన్ను దర్శించ వచ్చినాడని తెలిసి శ్రీకృష్ణుడు పరుగెత్తి పోయి ఎదురేగి ఆహ్వానించి పాదాలు కడిగి (ప్రక్షాళనము చేసి) ఊయలపై కూర్చుండ బెట్టెను. శ్రీకృష్ణుని వైభవము జూచిన కుచేలునకు నోట మాట రాకుండెను. తాను కానుకగా తెచ్చిన అటుకుల నివ్వ సందేహించుచుండెను. శ్రీకృష్ణుడది గ్రహించి తనంతట తానే అటుకుల మూట దీసి యొక గుప్పెడు యటుకుల భుజించెను. భగవానునికి భక్తి ప్రధానము గానీ వారేమి దెచ్చినారని గాదు. ఒక్క గుప్పెడు యటుకులు తినుటచే సుదామునికి ఇహ పరలోక సంపదలన్నియు లభించెను. సుదామున కివేమియు తెలియదు. తన పూరి గుడిశె (కుటీరము) రాజభవనముగ మారెను. అందు సకల సంపదలు, - ధన ధాన్యము, వజ్రవైడూర్యములు పశుసంపద, గుఱ్ఱములు, యేనుగులు, సమకూరెను. శ్రీకృష్ణుని సాదర, సత్కారములన్నియు బొంది భగవానుని నేమియు యాచించకయే మరలెను. తన యిల్లు జేరిన సుదాముని కంతయు నొక స్వప్నముగ గన్పట్టెను. భగవానుని అపార కరుణామృతము వానిపై వర్షించినది. సుదామునికి భక్తి మెండయినది. అతడైశ్వర్యములందునూ భగవానుని మరువ లేదు.

బహుళాశ్వుడు మిథిలా నగరపు రాజు. కృష్ణ భక్తుడు. అతని రాజ్యమున శ్రుత దేవుడను బ్రాహ్మణుడు కలడు. అతడు పేద వాడు శ్రీకృష్ణ భక్తుడు వారిరువురి భక్తికి ప్రసన్నుడయి వారిననుగ్రహించ దలచి మిథిలా నగరము వచ్చెను. ఇరువురు తమ తమ భక్తిచే భగవానునాహ్వానించిరి. భగవానునికి దరిద్రుడనియూ, ధనికుడనియు భేద భావము లేదు. వానికిరువురూ

సమానమే. శ్రీకృష్ణుడు రెండు రూపుల దాల్చి ఇరువురను సంతుష్ట పరిచెను. వారిరువురి యాతిథ్యము గొని కొద్దిరోజులు వారితో గడిపి తిరిగి ద్వారక జేరెను.



# 18. పాండవులకు సహాయము

పాండవులు తమ యరణ్యా యజ్ఞాత వాసముల ముగించు కొని తిరిగి వచ్చిరి. తమ రాజ్యము తిరిగి నీయవలసినదిగా కౌరవులను గోరిరి కానీ దుర్యోధనుడు నిరాకరించెను. పాండవులు శ్రీకృష్ణుని దూతగ హస్తినాపురముబంపిరి. దుర్యోధనుడు శ్రీకృష్ణుని స్వాగతమునకై భారీ సన్నాహముల గావించెను. కానీ శ్రీకృష్ణ భగవానుడు భక్తుడైన విదురుని యింటి కేగెను. విదురుడింట లేడు. అతని పత్ని భక్తి పారవశ్యములో భగవానునికి అరటి పండ్లు పక్కకు పడ వేసి తొక్కలు తినిపించసాగెను. భగవానుడు ఆనందముతో వానినే తిన సాగెను. విదురుడింటికి తిరిగి వచ్చి యిది యంతయు జూచి ఆమెను హెచ్చరించు వరకు తాను తొక్కల తినుపించు చున్న విషయమేతెలియదు, భక్తి యే ప్రాధాన్యము గానీ - తానేమి తినుచున్నాడో, విదుర పత్ని తన కేమిడుచున్నదో, ప్రేమతో నిడిన ఆహార మేదియైనను భగవానుడు స్వీకరించును. ఉదా : శబరి, భక్త కన్నప్ప, మొ!!

కౌరవ సభయందు శ్రీకృష్ణుడెంత తెలియజెప్పినను. (నచ్చ చెప్పినను) దుర్యోధనుడు వినలేదు. యుద్ధము వినాశకారి, బంధు నష్టము, జన నష్టము, ధన నష్టము జరుగును. యిందు సుఖమెవ్వరికినీ లేదు. రాజ్య మీయకున్నను అయిదుగురకు అయిదూళ్ళిచ్చిన చాలునని పాండవుల సందేశము విని పించెను. కానీ దుర్యోధనుడు యుద్ధమొనరించుటకే సంసిద్ధమాయెను. హితవు మాటలు చెప్ప వచ్చిన, రాయబారిగ వచ్చిన శ్రీకృష్ణ భగవానుని బంధింప కుతంత్రము బన్నెను, భగవానుని విశ్వ రూపమును గాంచిన కౌరవులందరు, నోట మాట రాక ఆశ్చర్య చకితులై,

భయభ్రాంతులైరి. తన రాయ బారము విఫలమయి నదియని తెలుసుకొన్న శ్రీకృష్ణుడు పాండవుల వద్దకు వెళ్ళి జరిగిన దంతయు తెలిపెను.

యుద్ధమనివార్యమని తెలిసిన యిరుపక్షములు (కౌరవ, పాండవులు) యుద్ధమున సహాయమునకై తమ పక్షములో పోరాడుటకై యితర రాజుల సహాయము కోరసాగిరి. శ్రీకృష్ణుని సహాయ మర్థించుటకై దుర్యోధ నార్జునులు ఒకే సారిగ ద్వారకకు వచ్చిరి. ఆ సమయమున శ్రీకృష్ణుడు నిదురించుచుండెను. మొదట దుర్యోధనుడు వచ్చి శిరస్సు వైపున నున్న ఆసనముపై కూర్చుండెను. అర్జునుడు తరువాత వచ్చి భగవానుని పాదముల వైపు చేతులు జోడించి నిలుచుండెను. శ్రీకృష్ణుడు నిద్ర మేల్కాంచి మొదట తన పాదముల వద్ద నిలుచున్న అర్జునుని గాంచెను. శ్రీకృష్ణ భగవానుడు వారిరువురితో - 'ఒక వైపున నాయొక్క పది వేల సైనికులు మరియొక వేపు నేను నిలిచెదము. కానీ నేను ఆయుధమును ధరింపను. కేవలము మాట సాయమే చేయుదును మీకు వలయునది కోరుకొనుడు అని బలికెను కోరుకొనుట మొదటగా అర్జునునకీయబడెను. అర్జునునకు భగవానుని ప్రతిభ, ప్రభావములు తెలియును. అందుచే నాతడు శ్రీకృష్ణుని తన పక్షము వహించు మనెను. దుర్యోధనుడు సైన్యముతో సంతుష్టినొంది హస్తినాపురము వెడలెను.

మహాభారత యుద్ధమున శ్రీకృష్ణ భగవానుడు పార్థసారథి యై రథమును తోలుచుండెను. రథము యిరు సేనల నడుమ నిలుప బడెను. బంధువు లందరినీ జూచి మాయామోహితుడై అర్జునుని చేతి నుండి ధనువు జారి పోయినది యుద్ధము చేయజాలనని రథమును వెనుకకు మరల్చుమని శ్రీకృష్ణుని కోరెను. అర్జునుని (భీరత్వము) జూచి భగవానుడు గీతోపదేశము జేసెను. ఆత్మకు జావు లేదు. కేవలము శరీరము మాత్రమే నశించును. ధర్మమును రక్షించుటకై యుద్ధము జేయుము. పాపము గాదు. గీత భగవానుని సుందర దివ్యోపదేశము గీత 'జ్ఞాన భండారము' నిత్యము గీతా పారాయణము జేయు వారి పాపములు పటా పంచలై పోవును★. భగవానుని గీతోపదేశమును విన్న యర్జునునకు జ్ఞానోదయమై యుద్ధ సన్నద్ధుడాయెను.

★ భగవానునికృపాకటాక్షములుండును

భగవాను డెప్పుడు భక్తుల ననుగ్రహించుచు వారిని గౌరవించి యాదరించును. వారి మాటల సమ్మానించును. కురుక్షేత్రమందు శ్రీకృష్ణునిచేత నాయుధము ధరింపజేతునని భీష్మ పితామహుడు ప్రతిజ్ఞ చేసెను. భీష్ముడు శ్రీకృష్ణ పరమాత్ముని భక్తుడు. భీష్ముని మాట నిలబెట్టుటకై యుద్ధము నందు తానాయుధము ధరించి భీష్ముని జంప నుంకించెను. కానీ యర్జునుడు భగవానుని తన ప్రతిజ్ఞ విడువ వద్దని పాదముల బట్టి ప్రార్థించెను. ★

శ్రీకృష్ణ భగవానుని సహాయము వలన పాండవులు మహాభారత యుద్ధమున గెలుపొందిరి. కౌరవ పక్షమున పోరాడు చున్న వీరులు ద్రోణాచార్యులు మరియు కర్ణుడు ప్రయోగించిన యస్త్రముల నర్జునుడు సైతము ఎదుర్కొన లేకపోయెను. కానీ శ్రీకృష్ణభగవానుడు ఏదో విధముగ నుపాయముతో పాండవుల కాపాడు చుండెను. భగవానుని కృప వలన, సహకారము వలననే పాండవులనేకమంది కౌరవ వీరుల హతమార్చిరి.

పాండవుల యందలి ప్రీతిచే శ్రీకృష్ణభగవానుడు మహాభారత యుద్ధమున అర్జునునకు సారథియైనాడు. సారధిగ తన కర్తవ్యమును మరువ లేదు. ఎంతయో శ్రద్ధగా రథమునకు గట్టిన గుర్రముల శుభ్రముగ తోమి కడిగెడి వాడు. వాని శరీరము లందు గుచ్చుకొనిన బాణముల తీసెడి వాడు. రాత్రులందు మేల్కొని నిదురించుచున్న పాండవుల రక్షించెడి వాడు. భగవానుని భక్తితో బంధింప వచ్చును. పాండవులు శ్రీకృష్ణభక్తులు. వారి యందలి యమితమైన అనురాగము ప్రేమచే వారిని వెన్నంటి కంటికి రెప్ప వలె కాపాడు చుండెడి వాడు. దీనికి కారణము పాండవులు ధర్మానువర్తనులు. ధర్మము, భగవానుని యందు భక్తి వారి విజయమునకు కారణమైనది. చివరికి భారత యుద్ధము సమాప్తమైనది. అంతిమమున, రథమును శ్రీకృష్ణుడు పాండవుల శిబిరము వద్దకు తీసుకొని వెళ్ళెను. మొదట అర్జునుని రథము నుండి క్రిందకు దిగమని యాదేశించెను. ఎప్పుడూ భగవానుడు తాను ముందుగ దిగి తదుపరి అర్జునుని రథమునుండి దిగమనెడి వాడు. అర్జునుడు రథము దిగినాడు. భగవానుడు రథము

★ కాని భీష్ముడు చక్రము ధరించి పరిగెత్తి తనను జంపవచ్చు శ్రీకృష్ణుని ఆహ్వానించుచూ రథము దిగి అంజలి జోడించి తనను జంపుమని పార్థించెను.

దిగగానే రథము నందగ్ని ప్రజ్వరిల్లి, గుఱ్ఱములతో సహా తమకు తామే భస్మమై పోయినవి. అర్జునాడాశ్చర్యముతో భగవానుని ప్రశ్నించగా - 'ద్రోణాచార్యులు మరియు కర్ణుడు సంధించిన యస్త్రములచే ఈరథము ఎప్పుడో దగ్ధమైనది. కానీ నా ప్రభావముచే నిప్పటి వరకును నిలిచి యున్నది యని తెలిపెను.

గదా యుద్ధమున భీమసేనుడు, దుర్యోధనుని తొడలను విరుగ గొట్టి సంహరించెను. యుద్ధము ముగిసినది. శ్రీకృష్ణ భగవానుడు పాండవులను ద్రౌపదీ సమేతముగా శిబిరము నుండి దూరముగ తోడ్కొని పోయెను. ఆ రాత్రి సమయమున ద్రోణాచార్యుని పుత్రుడు అశ్వత్థామ పాండవుల శిబిరమునకు వచ్చెను. ఈ విషయము ముందే గ్రహించి వారి ప్రాణములకు విపత్తి గలుగునని శ్రీకృష్ణ భగవానుడు వారిని దూరముగ తీసుకొని పోయెను. అశ్వత్థామ శిబిరమునకు నిప్పు పెట్టెను. పాండవులు రక్షింపబడిరి.

మహాభారత యుద్ధమున కౌరవులందరు సంహరింప బడిరి. వారి సేనలన్నియు అసువులు బాసినవి. కేవలము కృతవర్మ అశ్వత్థామ మరియు కృపాచార్యులు మాత్రమే జీవించి యుండిరి. పాండవుల పక్షమందు పంచ పాండవులు, శ్రీకృష్ణుడు మరియు అర్జునుని మిత్రుడు సాత్యకియు మిగిలిరి.

అశ్వత్థామ పాండవ శిబిరమునకు నిప్పుపెట్టి మిగతా వారితో పాటు ఉప పాండవులను గూడ సంహరించెను. మరునాడీ విషయము దెలిసిన యర్జునుడు అశ్వత్థామను బంధించి సంహరింప బోవ ద్రౌపదీ దేవి కరుణించి వానిని విడిపించెను. బ్రాహ్మణుని సంహరించిన బ్రహ్మ హత్యా దోషము తగులునని అశ్వత్థామకు శిరోముండనము జేసి వాని శిరమందున్న విలువైన చూడామణి దీసుకొని పంపివేసెను.

అశ్వత్థామ అంతటితో వీడ లేదు. ఈ మారు పాండవ వంశ నాశమునకే దలపెట్టెను. అభిమన్యుడు మహాభారత యుద్ధమునందు అన్యాయముగ జంపబడెను. వాని భార్య ఉత్తర గర్భవతి. పాండవ వంశాకురమును మోయుచున్నది. అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రము ఉత్తర గర్భమును దాకినది. నిప్పులు గక్కుచు దూసుకువచ్చుచున్న బ్రహ్మాస్త్రమును జూచి ఉత్తర భగవానుని శరణు వేడినది. శ్రీకృష్ణ భగవానుడొక సూక్ష్మరూపము

ధరించి ఉత్తర గర్భము జేరి, పిండమును రక్షింప సాగెను. నవమాసములు నిండి బాలుడు జన్మించగనే బ్రహ్మాస్త్రము వానిని సంహరించెను. కానీ శ్రీకృష్ణ భగవానుడా బాలుని జీవితునిగ జేసెను. ఆ బాలుడే పరీక్షిత్తు వీనికే శుకమహర్షి భాగవత కథల వినిపించెను.

ఒకనాడర్జునుడు శ్రీకృష్ణుని దర్శింప ద్వారక నగరమునకు వెళ్ళెను. ద్వారక యందొక బ్రాహ్మణ స్త్రీ కలదు. ఆమెకు ప్రతిమారు పుత్రుడు జన్మించగనే మరణించుచుండెను. ఆ బ్రాహ్మణ స్త్రీ భర్త చనిపోయిన పుత్రుని ఉగ్ర సేనుని ద్వారము వద్ద నుంచి దుర్భాషలాడు చుండెను. ఒక మారు బ్రాహ్మణుడు మరణించిన బాలుని రాజ ద్వారమున నుంచగా, వచ్చిన బ్రాహ్మణుని జూచి అర్జునుడు వానినోదార్చి వానికీ మారు పుట్టబోవు వానిని తప్పక రక్షింతునని అటుల చేయ లేనిచో తానగ్ని ప్రవేశము జేతునని వాగ్దానము జేసెను. బ్రాహ్మణుని పత్ని ప్రసవ వేదన పడుచున్నదని తెలిసి అర్జునుడా బ్రాహ్మణుని గృహము వెలుపలంతయు బాణములతో కప్పి గాలి కూడ చొరబడకుండగ రక్షణ కల్పించెను. కానీ ఈ మారు జన్మించిన బాలుని శరీర మాకాశమున కెగసి మాయ మయినది.

అర్జునుడు తన మాట నిల బెట్టుకొన లేక పోయినందులకెంతో లజ్జితుడయినాడు. తన యోగ బలముచే యమలోకము మరియు నితర లోకములన్నియు, బ్రాహ్మణుని పుత్రులకై గాలించెను. కానీ వారెవరును కాన రాలేదు. నిరాశజెందిన యర్జునుడు అగ్ని ప్రవేశము జేయుటకై నుంకింప శ్రీకృష్ణుడతనిని వారించి అర్జునుని తనతో గూడ క్షీర సాగర గర్భము నందలి శ్రీమన్నారాయణుని లోకమునకు గొని పోయెను. అచ్చటి నుండి బ్రాహ్మణ బాలకులను తోడి తెచ్చెను. ఈ విధముగ శ్రీకృష్ణ భగవానుడు, అన్ని సంకటముల నుండి, అర్జునుని సర్వదా, సర్వకాల సర్వావస్థల యందు రక్షించెను.



# 19. గ్రహణస్నానము - నందాదిగోపకులదర్శనము.

ఒకమారు సంపూర్ణ సూర్యగ్రహణము వచ్చినది. సంపూర్ణ సూర్యగ్రహణ మనగా పగలు కూడా రాత్రి వలె నంధకారమయమై గాన్పించును. గ్రహణ స్నానము జేయుటకై కురుక్షేత్రము నందు పెద్ద ఉత్సవము (జాతర) మొదటి నుండియు జరుగుచు వచ్చినది. గ్రహణ స్నానము జేయుటకై శ్రీకృష్ణుడు, బలరామదేవుడు, యాదవులు కొందరు కురుక్షేత్రమునకు బయలుదేరిరి. మహారాజు ఉగ్రసేనుడు, వసుదేవుడు మరియు వారి స్త్రీ లందరూ కురుక్షేత్రమున జేరిరి.

వీరే గాక గ్రహణ స్నానము జేయుటకై చాలామంది రాజులు మహర్షులు కురుక్షేత్రమునకు వచ్చిరి. అందరు గ్రహణ స్నానము జేసి బ్రాహ్మణులకు దానములొసగిరి. శ్రీకృష్ణుడు గూడ బ్రాహ్మణులకు, ధనము, ధాన్యము, వస్త్రములు మరియు సహస్ర గోవుల దానము జేసెను. బృందావనము నుండి నందుడు, యశోద మరియు గోప గోపి జనులందరునూ గ్రహణ స్నానము జేయుటకై నచ్చట కేతెంచిరి. గ్రహణ సమయమున శ్రీకృష్ణ భగవానుని దర్శనము గలుగునని, వారి యాశ. శ్రీకృష్ణుడు తన అన్న బలరాముని గూడి నందాదుల దర్శించుటకు బయలు దేరెను. నందుని యశోదమాతను ప్రణామములతో నర్చించిరి. తరువాత గోప గోపికల నందరినీ సత్కరించిరి.

కురుభూమి యందు వసుదేవుడొక యజ్ఞము చేసెను. బృందావనమునుండి విచ్చేసిన నందాదుల జూచి ద్వారకా వాసులెంతో ప్రసన్నులైరి. అందరూ కురుక్షేత్రము నందు చాల దినములు సంతోషముగ కలిసి గడిపిరి. వర్ష ఋతువు ఆరంభమైనది. వ్రజవాసులను, నంద యశోదలనందరినీ శ్రీకృష్ణుడు తగు రీతిగ సత్కరించి బృందావనమునకు బంపెను. తాను, మరియు ద్వారకా వాసులందరును తిరిగి ద్వారకకు జేరిరి.



## 20. శ్రీకృష్ణభగవానుడు తనసోదరులను తిరిగితెచ్చుట.

బలరామకృష్ణులు, తమ గురువు సాందీపుని కుమారుని యమలోకమునుండి తిరిగి తీసుకొని వచ్చిరని దేవకీదేవి వినియుండెను. ఒక దినము దేవకీ దేవి బలరామకృష్ణులను పిలచి 'కంసుడు నా ఆర్గురు పుత్రులను సంహరించెను. నా బిడ్డలను చూడవలెనని యున్నది' అని బల్కెను.

తమ తల్లిని సంతోషపెట్టుటకై బలరామకృష్ణులు రథారూఢులై సుతల లోకమున నున్న బలి చక్రవర్తి యొద్దకు జనిరి. బలి చక్రవర్తి పరమానంద భరితుడై బలరామకృష్ణులిరువురకు పాద పూజ జేసెను. బలిచక్రవర్తి వద్దనుండి తమ యార్గురు అన్నల తోడ్కొని ద్వారకకు తిరిగి వచ్చిరి. దేవకీ దేవి మరణించిన తన యార్గురు పుత్రుల జూచి యెంతయో ఆనందించెను.

సృష్టి ప్రారంభమందు మరీచి ముని కార్గురు పుత్రులు గలరు. వారొకమారు బ్రహ్మను జూచి యెగతాళి జేయ నారంభించిరి. అందులకు బ్రహ్మ కోపించి రాక్షసులై పొందని శాపమిడెను. వారా శాపకారణమున దైత్యులై బలి చక్రవర్తి యొద్ద నుండిరి. భగవానుని యోగమాయచే వారందరూ దేవకీ వసుదేవుల పుత్రులై జన్మించిరి. కంసుడు వారిని సంహరించి నపుడు తిరిగి బలివద్దకే జేరిరి. శ్రీకృష్ణ భగవానుడు వారిని సుతల లోకము నుండి తీసుకొని వచ్చెను. భగవానుని దర్శనము వలన వారి పాపములన్నియు తొలగిపోయెను. బ్రహ్మ యిడిన శాపము విమోచనమయినది. దేవకీ, వసుదేవులకు మరియు బలరామ కృష్ణులకు ప్రణమిల్లి వారు బ్రహ్మ లోకము జేరిరి.



# 21. శ్రీకృష్ణభగవానునిగోలోకధామప్రయాణము

--'యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం, 'సృజామ్యహమ్'.

4/7

ధర్మమునకు హాని సంభవించినపుడు తనను తానే సృజించు కొందునని భగవానుడు తెలిపెను. దుష్ట రాక్షస సంహార మొనరించి ఈ భూభారమును తగ్గించుటకై భగవానుడు గోలోకమునుండి శ్రీకృష్ణుని యవతారము దాల్చెను. మహాభారత యుద్ధము నందనేక మంది దుష్టులైన రాజులు సంహరింప బడినారు. బ్రహ్మ దేవుడు భగవానుని తిరిగి గోలోకమును జేరుడని ప్రార్ధించెను. శ్రీకృష్ణ భగవానుడు -- 'యదు వంశరాజులు మిక్కిలి బలవంతులయినారు. నేను తిరిగి గోలోకమునకు జేరిన తరువాత ప్రజలకు నష్టము వాటిల్ల వచ్చును. ఏల ననగా యదువంశరాజులు బలగర్వితులై యున్నారు. ఒకవేళ వీరు తమలో తాము పోట్లాడుకొని మరణించిన యెడల భూభారమింకను తగ్గును. -- 'అని యాలోచించెను. అవతార సమాప్తి యాసన్నమైనది. దేవతాంశలతో యదువంశమున జన్మించిన వారందరు తిరిగి దేవలోకమునకు జేరవలెను. కొంతమంది ముని పుంగవులు ద్వారకకు వచ్చిరి. వారిని జూచి కొంతమంది బాలురు నవ్వ సాగిరి. భగవానునిచే ప్రేరితులైన మునీశ్వరులు, యదువంశము నాశనము గాగలదని శపించిరి.

శ్రీకృష్ణభగవానుడు స్త్రీల, వృద్ధుల బాలురను సురక్షితమైన ప్రదేశమునకు తరలించెను. ద్వారకయందున్న బలిష్ఠులైన వీరులందరినీ తోడ్కొని తాను ప్రభాస తీర్థమున కేగెను. ప్రభాస తీర్థమున చిన్న విషయముపై కారణము లేకుండగనే వివాదము మొదలయినది. అదియే పెద్ద పోరుగా మారి ఆ యుద్ధము నందు యదు వీరులందరు యసువుల బాసిరి.

యదు వంశవీరుల మరణానంతరము బలరామ దేవుడు సముద్ర తటమందు గూర్చొని యోగమునందు తన దేహమును త్యజించెను.

శ్రీకృష్ణభగవానుడు, రావిచెట్టు నీడన ఉద్ధవునకు మరియు మైత్రేయ మునికి జ్ఞానోపదేశ మొనరించెను.

బ్రహ్మాది, దేవతలు, శంకరుడు మరియు ఇంద్రాదులు భగవానుని యవతార సమాప్తి తిలకించవలెనని వేచి యుండిరి. కానీ భగవానుడు తన యవతార సమాప్తి దర్శనము నీయక నొక్క మారుగ నంతర్ధానమయ్యెను.

శ్రీకృష్ణుని రథసారథి దారుకుడు, ద్వారకలోని వారందరకు యాదవ వీరులందరు మరణించిరను వార్త దెలియజేసెను. వృద్ధులీ సమాచారము వినినంతనే మూర్ఛితులై యసువుల బాసిరి. చాల మంది స్త్రీలు సహగమనము జేసిరి. అర్జునుడా దినములలో ద్వారక యందే యుండెను. చనిపోయిన వారందరికీ క్రియాకర్మల నొనరించెను. (అంతిమ సంస్కారము) శ్రీకృష్ణభగవానుని యవతార సమాప్తి జరిగిన ఏడవ దినమున ద్వారకా నగర మంతయు సముద్రమున మునిగి పోయెను. కేవలము శ్రీకృష్ణ భగవానుని మందిరము మాత్రమే మిగిలినది అందరూ మరణించగా మిగిలిన బాలురను, స్త్రీలను తోడ్కొని యర్జునుడు హస్తినాపురము జేరెను. శ్రీకృష్ణుని ప్రపౌత్రుడు, అనిరుద్ధుని పుత్రుడయిన వజ్రనాభుని అర్జునుడు మధురకు రాజుగ చేసెను.

శ్రీకృష్ణ భగవానుడు సాక్షాత్ శ్రీమన్నారాయణుడు. భగవానుడు పిపీలి కాది బ్రహ్మ పర్యంతము విద్యమానుడు. భక్తితో భజించిన వారికి దర్శనమొసగును. శ్రీకృష్ణ భగవానుని స్మరించిన, వాని కథలు విన్నను, చదివినను సర్వపాపవిముక్తులై ఇహమునందు సుఖమునంది పరమునందు స్వర్గ ప్రాప్తి నందుదురు.

శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

శ్రీకృష్ణ భగవాన్‌కీ జై మంగళం మహత్

ఓం శాంతిః శాంతిః శాంతిః

# 22. మిమ్ములను పరీక్షించుకొనుడు

ఈ క్రింద కొన్ని ప్రశ్నలు గలవు అవి 'తప్పో', మరియు 'ఒప్పో' మీరే జవాబుల నీయ వలెను. ప్రతి ప్రశ్నకు పది మార్కులు మీరు 200 మార్కులు. గణించిన మీరీ పుస్తకము నెంతయో శ్రద్ధతో పఠించిన వారలవుదురు. లేనిచో యీ పుస్తకమును తిరిగి పఠింపుడు. ఆఖరి పేజీ నందు జవాబు లీయబడినవి. వానికి మీ సమాధానముల జోడించి చూచుకొనుడు.

1. శ్రీకృష్ణ భగవానుడు కారాగృహము నందు జన్మించెను. ఆయన తండ్రి వసుదేవుడు భగవానుని రాత్రియందు గోకులమున విడచి వచ్చెను. ( )
2. నందుడు శ్రీకృష్ణుని తన పుత్రునిగనే భావించెను. ( )
3. శ్రీకృష్ణుడు పూతనను గొంతు నులిమి చంపివేసెను. ( )
4. బలరాముడొక శకటమును విరుగ గొట్టెను దానిచే శకటాసురుడు మరణించెను. ( )
5. యశోదా దేవి శ్రీకృష్ణుని రోటికి కట్టి వేసెను. ఆరోటిని రెండర్జున వృక్షముల నడుమ గుండా లాగి వాటిని పడ వేసెను. ( )
6. బకాసురుడొక కొంగ రూపమున శ్రీకృష్ణుని మ్రింగి వేసెను. శ్రీకృష్ణుడు దాని ముక్కు పట్టికొని రెండుగ చీల్చివేసెను. ( )
7. ప్రలంబాసురుని మరియు ధేనుకాసురుని బలరామ దేవుడు ఒక్క పిడికిలి దెబ్బతో సంహరించెను. ( )
8. అఘాసురుని నోరొక కొండగుహవలె నుండెను. మొదట శ్రీకృష్ణ భగవానుడా గుహను జూచుటకై యందు ప్రవేశించెను. ( )
9. కాళియుని సంహరించుటకై శ్రీకృష్ణుడే స్వయముగ మడుగు లోనికి దూకెను. కాళియుని పడగలపై నాట్య మాడసాగెను. భగవానుని యాదేశాను

సారము కాళియుడు యమునను వీడి సముద్రము జేరెను.( )

10. గోవర్ధన గిరిని శ్రీకృష్ణుడు బలరాముని సాయముతో నెత్తెను. బృందావనము నందలి యెన్నియో గృహములు ఇంద్రునిచే కల్పింపబడిన వర్షముచే కొట్టుకొని పోయెను. ( )

11. మధుర జేరిన మొదటి దినముననే శ్రీకృష్ణుడు కంసుని ధనుస్సు విరిచి వేసెను. ఏ ఆయుధము లేకుండగనే కువలయమును చంపెను. ( )

12. శ్రీకృష్ణుడు కంసుని కేశముల బట్టి యీడ్చెను. కంసుని సోదరులనందరినీ బలరాముడు సంహరించెను. ( )

13. శ్రీకృష్ణుడు తన యన్న బలరామునితో గూడి విద్యాభ్యాసమునకై ఉజ్జయిని వెళ్ళెను.

14. శ్రీకృష్ణుడు సముద్రమున మునిగి పోవుచున్న గురు పుత్రుని రక్షించి గురువు గారికి సమర్పించెను. ( )

15. కాలయవనుని జూచి భయపడి శ్రీకృష్ణుడు పారిపోయెను.( )

16. ద్వారకా నగర మొక పర్వతము మీద నిర్మింప బడినది. ( )

17. రుక్మిణీ దేవి శ్రీకృష్ణునే తన పతిగా భావించినది. అందువలననే శ్రీకృష్ణుడు రుక్మిణీ దేవిని హరించెను. ( )

18. రాజసూయ యాగము నందు శిశుపాలుని దుర్భాషల నెంతో సేపు శ్రీకృష్ణుడు సహించి యూర కుండెను. ( )

19. శిశుపాలుని పక్షమున పోరాడుటకై సాల్వుడు తన విమానమున గూర్చుండి ద్వారకకు వచ్చెను. శ్రీకృష్ణుడా విమానమును క్రింద నుండియే గద విసిరి విరుగ గొట్టెను. ( )

20. శ్రీకృష్ణుడదృశ్యముగ నుండి ద్రౌపదీ దేవికి చీరల నొసగెను. ఆ చీరలు లాగలేక దుశ్శాసనుడు అలసి పోయెను. ( )

21. దుర్వాసముని పాండవుల నాశీర్వదించుటకై యడవి కేగెను. ధర్మరాజు వానికి భోజనమిడి పంపివేసెను. ( )

22. శ్రీకృష్ణుడు పాండవుల పక్షమున నున్నందు వలననే వారు మహాభారత యుద్ధము గెలిచిరి. ( )

23. క్రోధముతో ఋషులు యదు వంశము నాశనమగునట్లు శపించిరి. ఈ శాపము కృష్ణుని నెంతయో కలచివేసెను. ( )

24. శ్రీకృష్ణుడు విమానా రూఢుడై గోలోకధామము జేరెను. ( )

జవాబులు :

| | | | |
|---|---|---|---|
| 1)ఒప్పు | 2) ఒప్పు | 3) తప్పు | 4) తప్పు |
| 5) ఒప్పు | 6) ఒప్పు | 7) ఒప్పు | 8) తప్పు |
| 9) ఒప్పు | 10) తప్పు | 11) ఒప్పు | 12) ఒప్పు |
| 13) ఒప్పు | 14) తప్పు | 15) తప్పు | 16) తప్పు |
| 17) ఒప్పు | 18) ఒప్పు | 19) ఒప్పు | 20) ఒప్పు |
| 21) తప్పు | 22) ఒప్పు | 23) తప్పు | 24) తప్పు |



# అచ్యుతాష్టకమ్

అచ్యుతం కేశవం రామనారాయణం
కృష్ణదామోదరం వాసుదేవం హరిమ్,
శ్రీధరం మాధవం గోపికావల్లభం
జానకీనాయకం రామచంద్రం భజే. 1

అచ్యుతం కేశవం సత్యభామాధవం
మాధవం శ్రీధరం రాధికారాధితమ్,
ఇందిరామందిరం చేతసా సుందరం
దేవకీనందనం నందజం సందధే. 2

విష్ణవే జిష్ణవే శంఖినే చక్రిణే
రుక్మిణీరాగిణే జానకీజానయే,
వల్లవీవల్లభాయార్చితాయాత్మనే
కంసవిధ్వంసినే వంశినే తే నమః. 4

కృష్ణ! గోవింద! హే రామ! నారాయణ!
శ్రీపతే! వాసుదేవాజిత! శ్రీనిధే!
అచ్యుతానంత! హే మాధవాధోక్షజ!
ద్వారకానాయక! ద్రౌపదీరక్షక! 4

రాక్షసక్షోభితః సీతయా శోభితో
దండకారణ్యభూపుణ్యతాకారణః,
లక్ష్మణేనాన్వితో వానరైః సేవితో
ఽగస్త్యసంపూజితో రాఘవః పాతు మామ్. 5

ధేనుకారిష్టకానిష్టకృద్ద్వేషిహా
కేశిహా కంసహృద్వంశికావాదకః,
పూతనాకోపకః సూరజాఖేలనో
బాలగోపాలకః పాతు మాం సర్వదా. 6

విద్యుదుద్యోతవత్ప్రస్ఫురద్వాససం
ప్రావృడంభోదవత్ప్రోల్లసద్విగ్రహమ్
వన్యయా మాలయా శోభితోరఃస్థలం
లోహితాంఘ్రిద్వయం వారిజాక్షం భజే. 7

కుంచితైః కుంతలైః భ్రాజమానాననం
రత్నమౌళిం లసత్కుండలం గండయోః,
హారకేయూరకం కంకణప్రోజ్జ్వలం-
కింకిణీమంజులం శ్యామలం తం భజే. 8

అచ్యుతస్యాష్టకం యః పఠేదిష్టదం
ప్రేమతః ప్రత్యహం పూరుషస్సస్పృహమ్,
వృత్తతః సుందరం కర్తృవిశ్వంభర
స్తస్యవశ్యో హరిర్జాయతే సత్వరమ్.

॥ ఇతి శ్రీమచ్ఛంకరాచార్యకృతమ్ అచ్యుతాష్టకం సంపూర్ణమ్ ॥



# శ్రీకృష్ణాష్టకమ్

భజే వ్రజైకమండనం సమస్తపాపఖండనం
స్వభక్తచిత్తరంజనం సదైవనందనందనమ్,
సుపిం;గుచ్ఛమస్తకం సునాదవేణుహస్తకం
అనంగరంగసాగరం నమామి కృష్ణనాగరమ్. 1

మనోజగర్వమోచనం విశాలలోలలోచనం
విధూతగోపశోచనం నమామి పద్మలోచనమ్,
కరారవిందభూధరం స్మితావలోకసుందరం
మహేంద్రమానదారణం నమామి కృష్ణవారణమ్. 2

కదంబసూనకుండలం సుచారుగండమండలం
వ్రజాంగనైకవల్లభం నమామి కృష్ణదుర్లభమ్,
యశోదయా సమోదయా సగోపయా సనందయా
యుతం సుఖైకదాయకం నమామి గోపనాయకమ్. 3

సదైవ పాదపంకజం మదీయమానసే నిజం
దధానముత్తమాలకం నమామి నందబాలకమ్,
సమస్తదోషశోషణం సమస్తలోకపోషణం
సమస్తగోపమానసం నమామి నందలాలసమ్. 4

భువో భరావతారకం భవాబ్ధికర్ణధారకం
యశోమతీకిశోరకం నమామి చిత్తచోరకమ్,
దృగంతకాంతభంగినం సదా సదాలసంగినం
దినే దినే నవం నవం నమామి నందసంభవమ్. 5

గుణాకరం సుఖాకరం కృపాకరం కృపాపరం
సురద్విషన్నికందనం నమామి గోపనందనమ్,
నవీనగోపనాగరం నవీనకేళినాగరం
నమామి మేఘసుందరం తడిత్ప్రభాలసత్పటమ్. 6

సమస్తగోపనందనం హృదంబుజైకమోదనం
నమామి కుంజమధ్యగం ప్రసన్నభానుశోభనమ్,
నికామకామదాయకం దృగంతచారుసాయకం
రసాలవేణుగాయకం నమామి కుంజనాయకమ్. 7

విదగ్ధగోపికామనోమనోజ్ఞతల్పశాయినం
నమామి కుంజకాననే ప్రవృద్ధవహ్నిపాయినమ్,
కిశోరకాంతిరంజితం దృగంజనం సుశోభితమ్
గజేంద్రమోక్షకారిణం నమామి శ్రీవిహారిణమ్. 8

యదా తదా యథా తథా తథైవ కృష్ణసత్కథా
మయా సదైవ గీయతాం తథా కృపా విధీయతామ్,
ప్రమాణికాష్టకద్వయం జపత్యధీత్య యః పుమాన్
భవేత్ స నందనందనే భవే భవే సుభక్తిమాన్.

॥ ఇతి శ్రీమచ్ఛంకరాచార్యకృతమ్ అచ్యుతాష్టకం సంపూర్ణమ్ ॥



# మా ప్రచురణలు (పారాయణ గ్రంథములు)
## (Our Telugu Publications)

1172 శ్రీమద్భగవద్గీత తత్త్వవివేచనీ వ్యాఖ్యానము
772 శ్రీమద్భగవద్గీత (శ్లోక తాత్పర్యములు) (పదచ్ఛేత టీకా తాత్పర్యము)
771 శ్రీమద్భగవద్గీత (శ్లోక తాత్పర్యములు)
1390 శ్రీమద్భగవద్గీత (పెద్ద అక్షరములలో శ్లోక తాత్పర్యములు)
1031 శ్రీమద్భగవద్గీత (శ్లోకతాత్పర్యసహితము) పాకెట్‌సైజు
1531 శ్రీమద్భగవద్గీత మరియు విష్ణుసహస్రనామ సహితము
1526 శ్రీమద్భగవద్గీత మూలము (పాకెట్‌సైజు) (పెద్దఅక్షరాలు)
662 శ్రీమద్భగవద్గీత విష్ణుసహస్రనామావళి సహితము
663 శ్రీమద్భగవద్గీత (వచనము)
1309 శ్రీమద్భగవద్గీత పారాయణ మహత్మ్యకథలు
1028 గీతామాధుర్యము
1570 శ్రీమద్భగవద్గీత (అగ్గిపెట్టెసైజ్)
1571 శ్రీమద్భగవద్గీత (లఘుఆకారము)
1766 శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రము (సటీకము)
1527 శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రము (నామావళి సహితము)
670 శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రము (పాకెట్ సైజ్)
911 శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రము (లఘుఆకార్)
1352 శ్రీరామచరితమానసము (సటీకము)
1419 శ్రీరామచరితమానసము (వచనము)
753 శ్రీరామచరితమానసము (సుందరకాండము సటీకము)

**శ్రీమద్వాల్మీకి రామాయణము**

1557 శ్రీమద్వాల్మీకి రామాయణము - పార్ట్ 1 (సటీకము బాలకాండము - అయోధ్యాకాండములు)
1622 శ్రీ మద్వాల్మీకి రామాయణము - పార్ట్ 2 (సటీకము అరణ్య, కిష్కింద, సుందరకాండములు)
1745 శ్రీమద్వాల్మీకి రామాయణమ్ - పార్ట్ 3 (సటీకము యుద్ధ- ఉత్తరకాండములు)
1477 సుందరకాండము సటీకము
1466 సుందరకాండము మూలము (డమ్మీసైజ్)
1532 సుందరకాండము వచనము (డమ్మీసైజ్)
924 సుందరకాండము మూలము (పాకెట్‌సైజ్)
675 సంక్షిప్త రామాయణము
1639 బాల రామాయణము (లఘు ఆకారము)
845 అధ్యాత్మ రామాయణము (సటీకము)
1632 శ్రీ మహాభారతము (విరాటపర్వము)
1741 శ్రీ మహాభారతము (ఉద్యోగపర్వము)
1573 శ్రీ మద్భాగవత మహాపురాణము (మూలము)
1738 శ్రీ మద్ భాగవత సంగ్రహము
1699 శ్రీ మహాభాగవత మకరందాలు
1767 భాగవత మాధుర్యము
908 శ్రీ నారాయణీయము (మూలము)
1698 శ్రీ మన్నారాయణీయము శ్లోకములు (తాత్పర్యములు)
676 శ్రీ హనుమాన్ చాలీసా
1502 శ్రీ నామరామాయణము, హనుమాన్ చాలీసా
1569 శ్రీ హనుమత్ స్తోత్రావళి
912 శ్రీ రామరక్షాస్తోత్రము
801 శ్రీ లలితాసహస్రనామస్తోత్రము (పాకెట్ సైజ్)
974 శ్రీ లలితాసహస్రనామస్తోత్రము (లఘుఆకార్)
1763 శ్రీ లలితాసహస్రనామస్తోత్రము (ఖడ్గమాల - త్రిశతి నామావళి సహితం)
674 శ్రీ గోవింద దామోదర స్తోత్రము

1764 గోవింద నామావళి
677 గజేంద్ర మోక్షము
732 నిత్యస్తుతి
1023 శివ మహిమ్నః స్తోత్రము
973 శ్రీ శివస్తోత్రావళి
1761 శ్రీ శివసహస్రనామ స్తోత్రము - సటీకము
1758 శ్రీ శివపంచాయతన పూజావిధి
1026 శ్రీ పంచసూక్తమ్ (రుద్రమ్)
1684 శ్రీ గణేశ స్తోత్రావళి
1024 శ్రీ నారాయణ కవచము
1754 శ్రీ లక్ష్మీసహస్రనామ స్తోత్రమ్
1025 స్తోత్ర కదంబమ్
914 స్తోత్ర రత్నావళి
930 దత్తాత్రేయ వజ్రకవచము
1685 శ్రీ దేవి స్తోత్రావళి
972 శతకత్రయము
846 ఈశావాస్యోపనిషత్ సటీకపురుషసూక్త సహితము
909 దుర్గాసప్తశతీ (మూలము)
1029 సంకీర్తనావళి
1030 సంధ్యోపాసనవిధి
910 వివేక చూడామణి
904 నారద భక్తిసూత్రములు
1714 గీతా దైనందిని

## తెలుగు కథల పుస్తకములు

665 ఆదర్శనారి సుశీల
664 సతీసావిత్రి
689 భగవానుని అయిదు నివాసస్థానాలు
766 మహాభారతములోని కొన్ని ఆదర్శపాత్రలు
768 రామాయణములోని కొన్ని ఆదర్శపాత్రలు
760 పరమోత్తమ శిక్షణ
916 నలదమయంతుల కథ
915 నీతికథామంజరి (కథలు)
641 శ్రీకృష్ణభగవానుడు
692 మదురగాథలు
919 మంచికథలు
686 భక్తఉద్ధవ
687 ఆదర్శభక్తులు
682 పంచభక్తరత్నాలు
685 బాలభక్తులు
688 భక్తధ్రువుడు
691 భీష్మపితామహుడు
767 భక్తరాజు హనుమంతుడు
917 భక్తచంద్రిక
918 సప్తభక్తరత్నాలు
929 మహాభక్తులు
1027 శ్రీహనుమత్ చరితామృతము
1572 పదుకొండు నీతికథలు
1751 మహాత్మ విదురుడు
1752 ఆదర్శకథలు
1755 మహాపురుషుల జీవితాదర్శములు
1760 ద్వాదశ జ్యోతిర్లింగ మహిమ
1765 మంచితనమునకు -మంచిఫలాలు
1757 ఆదర్శభ్రాతృప్రేమ

## తెలుగు వర్ణచిత్ర కథలు

887 జై హనుమాన్
1301 నవదుర్గ
959 చిట్టికృష్ణుడు
960 గోపాలుడు
961 మోహనుడు
962 శ్రీకృష్ణుడు
963 చిన్నిరాముడు
964 శ్రీరామచంద్రుడు
967 శ్రీమద్రామాయణములోని ముఖ్యపాత్రలు
968 శ్రీమద్భాగవతములోని ముఖ్యపాత్రలు
1686 అష్టవినాయకులు
966 సూర్యభగవానుడు
965 దశావతారములు
969 గోసేవ దాని ఫలము
971 బాలల బొమ్మల చైతన్యలీల
970 మన ప్రముఖ స్త్రీ దేవతలు
1753 శ్రీమద్ భాగవతములోని ముఖ్యమైన కథలు